

కుంభకోణం రామస్వామి ఆలయంలో శిలాశ్వ శిల్పం

ఫోటో: ఎస్. రామకృష్ణ—మాయవరం



"నృత్యతి హరిరిహ సరసవసన్తే...."

ఫోటో: డి. యస్. అంబూరావు,—విశాఖపట్టణము.

సంవత్సర చందా
రు. 12-0-0
విడిప్రతి 4 అ.



# ఆంధ్రపత్రిక

సచిత్రవారపత్రిక

Founder : K. NAGESWARA RAO

సంపుటము 50
సంచిక 40
6-6-56

దుర్ముఖ వైశాఖ బహుళ ద్వాదశి బుధవారం

## విషయానుక్రమణిక




ఢిల్లీ నగరం గ్రీష్మవాతావరణంతో బీభత్సంగా ఉంది. ఈ వాతావరణం ఢిల్లీలో అసహజమేమీ కాదు. గ్రీష్మం కొంచెం తొందరపడి ముంచుకుపోయినట్టు రావడం మాత్రమే కొత్తవిశేషం. నీటి ఎద్దడి కూడా ఢిల్లీకి సహజమే. స్వానుభవాన్నిబట్టి చెప్పాలంటే, నేను ఉండేది మేడ కిందిభాగంలోనే అయినా కుళాయిలోంచి నీరు సరిగ్గారాదు. రెండో అంతస్తులో, మూడో అంతస్తులో ఉండేవారి మాట చెప్పనక్కరలేదు.

పార్లమెంటు వీథిని బాగా అభివృద్ధి చేస్తున్నారు. ఈ వీథికి రెండుపక్కలా ఆకాశహార్మ్యాలు లేస్తున్నాయి. ఈ కొత్త పద్ధతి సౌధాలలో నివసించబోయేజనం అగచాట్లు ఊహించవలసిందే.

* * *

న్యూఢిల్లీలో ఇటీవల కొన్ని చిన్నవి, కొన్ని పెద్దవి సంచలనాలు కలిగాయి. చిన్నవాటిలో పేర్కొనదగినది భారత ప్రధాని మీద కొన్ని స్థానిక పత్రికల ద్వారా జరిగిన బహిరంగ దండయాత్ర. ఈ పత్రికలు కాంగ్రెసు జెండాకింద దాక్కొని కొందరి స్వార్థప్రయోజనాలను సంరక్షించడం పనిగా పెట్టుకున్నాయి. ఈ దండయాత్రను పురికొల్పింది ప్రధానితో పనిచేసే సహాయమంత్రులేనని చూచాయగా వచ్చిన వార్తలతో ఈ సంచలనం కలిగింది.

* * *

పబ్లిక్ అక్కౌంట్సు కమిటీసభ్యుల పేర్లు ఈమధ్య ప్రకటించారు. పేర్లనుబట్టి చూస్తే ఇదివరకటి కమిటీసభ్యులకంటె ఈ సభ్యులే మెరుగని తోస్తుంది. శ్రీ టి. ఎన్. సింగ్ ను మళ్ళీ ఎన్నుకోవడం హర్షించదగినది. శ్రీమతులు శకుంతలానాయర్, తారకేశ్వరీ సిన్హాలను తీసుకోవడంకూడా బాగానే ఉంది.

శ్రీమతి శకుంతలానాయర్ లోక్ సభలో సభ్యత్వప్రమాణస్వీకారం చేస్తూ మొదటి ఉపన్యాసంచేసింది. "లోక్ సభలో సభ్యురాలుగా ఎన్నుకోబడినందువల్ల" తాను ఏమేం చేయబోయేదీ అన్నీ చెప్పేసింది. మొదట్లో ఆమె ప్రశ్నాకాలంలో చాలా ఉబలాటం కనబరచేది. తరవాత అది తగ్గిపోయింది. ఇక శ్రీమతి తారకేశ్వరీసిన్హా పార్లమెంటులో 'గ్లామర్ తార' గానే చెలామణీ అవుతోంది. ఈ లెక్కన పబ్లిక్ అక్కౌంట్సు కమిటీ చిత్రప్రదర్శనశాలగా తయారవుతుంది. ఈ బాపతు పక్షపాత వైఖరులను నిరసిస్తూ వందమంది పార్లమెంటు సభ్యులు పిటీషన్ పెట్టారంటే ఆశ్చర్యం లేదు.

* * *

అసలు పెద్దసంచలనం ఇంకోటుంది. అది భారత ఆడిటర్ జనరల్ - కంట్రోలర్ గారి అధికార విస్తరణ వాదానికి సంబంధించినది. పదొనిమిది నెలల కిందట ఆయన అధికారానికి వచ్చినప్పటినుంచీ తన రాజ్యాన్ని విశాలం చెయ్యాలని ఆయన ఒత్తిడిచేస్తున్నాడు. తగాదా ఆయనకీ ఆర్థికమంత్రికీ మధ్య కాదు; ఆర్థిక సుస్థిరతకీ, అరాచకానికీ మధ్య. ఆడిటర్ జనరల్ పదవికి తన పేరు సూచింపబడినప్పటినుంచే, ఆయన ఆర్థికశాఖ అజ్మాయిషీని ఎదిరించడం మొదలెట్టాడు. ఈ వివాదం ఆర్థికమంత్రి తన పదవికి రాజీనామా ఇచ్చేదాకా వెళ్ళింది. చివరికి నివేదికలన్నీ బుట్టదాఖలు కావడమో, షెల్ఫులలో చెదలుపట్టడమో జరిగింది. మొత్తానికి అవి అమలులోకి రాలేదు.

**శ్రీకృష్ణ**
**(ఆంధ్రపత్రిక ప్రతినిధి)**

ఆడిటర్ జనరల్ మహాశయుడు చేసిన రెండోపని ఇండియన్ సివిల్ సర్వెంట్ల జీతాలమీద, పింఛనులమీద దండెత్తడం.

మూడోపని, జాతీయం చేయబడిన ఇన్సూరెన్సు కార్పొరేషన్ అక్కౌంట్లను ఆడిట్ చేసే హక్కు తనకున్నదని ఆయన ప్రకటించడం. ఈ విషయంలో ఆయన తరఫున అనేక చోట్లనుంచి ఒత్తిడి వచ్చిందని ఆర్థికమంత్రి బయటపెట్టారు. ఆడిటర్ జనరల్ తరఫున వకాల్తా పుచ్చుకొని వాదించిన పెద్దమనిషి శ్రీ రాజగోపాలాచారిగారి అబ్బాయి శ్రీ సి. ఆర్. నరసింహన్. ఈ నరసింహన్ గారికి జలాంతర్గాములనుంచి మద్యనిషేధం దాకా, జాతీయ పరిశ్రమల అక్కౌంట్లను ఆడిట్ చేయడానికి ఆడిటర్ జనరల్ కున్న హక్కు దాకా అక్కర్లేనిదంటూ ఏ పనీ లేదు. పార్లమెంటు సోషలిస్టు సవరణను తిరస్కరించడంతో ఆడిటర్ జనరల్ యొక్క, ఆయనతాలూకు వ్యక్తుల యొక్క నోళ్లు కట్టుపడిపోయాయి.

ఆడిటర్ జనరల్ గారి తరఫున జరిగే 'ఒత్తిడి' కొంచెం ఆందోళనపడదగిన సంగతే. ప్రధాని అధ్యక్షతన జరిగే కేంద్ర మంత్రివర్గ సమావేశాల్లో ఆయన గారు రెండుసార్లు ఓడిపోయిన సంగతి దృష్ట్యా "కొందరు పార్లమెంటు సభ్యులకు" అందజేయబడిన ఈ క్రిందిలేఖ పరిశీలించదగ్గది.

"1956 మే 11వ తేదీన పార్లమెంటులో ఒక అనుబంధ ప్రశ్నకు ఆదాయ వ్యయశాఖ మంత్రి సమాధానమిస్తూ బ్రిటన్ లో జాతీయ పరిశ్రమలను ఆడిట్ చేసే అధికారం కంట్రోలర్ - ఆడిటర్ జనరల్ కు లేదనీ,ఉన్నదని అతడెప్పుడూ ఒత్తిడిచెయ్యలేదనీ అన్నారు. ఈ సమాధానంవలన మన జాతీయపరిశ్రమల ఆడిట్ విషయమై కొన్ని అపోహలు కలగవచ్చు గనక, భారతదేశంలోను, బ్రిటన్ లోను జాతీయపరిశ్రమలకు సంబంధించినంతవరకూగల భేదాలను పార్లమెంటు ఆర్థికసంఘాల దృష్టికి తీసుకురావడం అవసరమవుతున్నది.

బ్రిటన్ లో జాతీయ పరిశ్రమలకు ప్రభుత్వం స్వయంగా పెట్టుబడులు పెట్టడంలేదు. డిబెంచర్లను జారీచెయ్యడం ద్వారానే కావలసిన పెట్టుబడినంతటినీ సేకరించుతారు. వీటికి ప్రభుత్వ పూచీ మాత్రమే ఉంటుంది. అయినప్పటికీ ఆ పరిశ్రమల ఆర్థికబాధ్యతవిషయమై పార్లమెంటులో చాలాసార్లు ఆందోళన జరిగింది. 1952 లో నియమించబడిన జాతీయ పరిశ్రమల సెలెక్ట్ కమిటీ 'ఈ పరిశ్రమల ఆడిట్ బాధ్యత తీసుకోగలరా' అని కంట్రోలర్-ఆడిటర్ జనరల్ ను అడిగింది. అతడు తీసుకుంటానని చెప్పాడు. కాని దానివల్ల




# న్యూ ఢిల్లీ లేఖ

తన సిబ్బందిని బాగా ఎక్కువ చేయవలసి వస్తుందని, అంతేగాక వృత్తిరీత్యా ఆడిటర్లు అయినవారిని తాను ఎక్కువగా ఉపయోగించడం కుదరదనీ కూడా అతడు చెప్పాడు. అందుచేత జాతీయ పరిశ్రమలను అజమాయిషీ చేసేందుకు పార్లమెంటే ఒక స్థాయీ సంఘాన్ని ఏర్పాటు చేయవలసి ఉంటుందని, ఈ సంఘానికి కంట్రోలర్-ఆడిటర్ జనరల్ హోదాగలిగిన ఒక అధికారి సహాయపడుతూ ఉండాలనీ సెలెక్ట్ కమిటీ సూచన చేసింది.

ఈ సందర్భంలో కంట్రోలర్, ఆడిటర్ జనరల్ ఈ సంఘం సమావేశంలో చెప్పిన ఒకవిషయం గమనించతగ్గది. రాజ్యాంగం ఆదేశాలదృష్ట్యా దీనికి కొంత ప్రాధాన్యం ఉన్నది. అసలు ప్రభుత్వం వశపరచుకొన్న పారిశ్రామికసంస్థల విషయమై మీరు పార్లమెంటుకి అందచేసిన నివేదికలలో వాటి మంచిచెడ్డలగురించి ఏమైనా వ్రాశారా అని అడిగితే లేదనే జవాబిచ్చారు. "నిజానికి అవి నా పరిధిలోకి రావు. వాటి పెట్టుబళ్లకి ప్రభుత్వం పూచీకత్తు ఇవ్వాలసివస్తేనే తప్ప, నేను వాటిజోలికి పోవడానికి వీలులేదు" అని ఆడిటర్ జనరల్ స్పష్టంగా చెప్పారు.

అయితే, ఆయా పరిశ్రమలను జాతీయం చేసినపుడు కేంద్ర సమాహారనిధి (కన్సాలిడేటెడ్ ఫండ్) నుండి డబ్బు తీసుకోవటం జరిగినపుడు మాత్రం, సమాహారనిధిపై పార్లమెంటుకు తాము దరిమిలా ఇచ్చే నివేదికలో ఈ వ్యవహారం సంగతి ఎత్తి, చెప్పదలచుకొన్న సంగతి చెప్పవచ్చునని ఆయన తెలియచేశారు.

ఇక మనదేశంలో తరహా వేరు. ప్రభుత్వం వశపరచుకొన్న పరిశ్రమలకు, అంతా కాకపోయినా, చాల వరకు పెట్టుబడి ప్రభుత్వ నిధులనుంచే సరాసరి సమకూర్చుతారు. దీనికి తగ్గ లెక్కలో సమాహార నిధినుండి డబ్బు తీసుకుంటూ ఉంటారు.

ఈ వ్యవహారాన్ని తాము తనిఖీ చేయవలసిందేనని ఆడిటర్ జనరల్ వాదం. బ్రిటన్‌లో అనుసరించే పద్ధతుల దృష్ట్యా, మన రాజ్యాంగంలోని సూత్రాల ప్రకారం, పరిశీలిస్తే, సమాహార నిధినుండి, ఏ కారణం వల్లగాని, ఏ పద్ధతిలో అయినా సరే డబ్బు తీసినపుడు కంట్రోలర్, ఆడిటర్ జనరల్ దాన్ని తనిఖీ చేయడం, అవసరం పార్లమెంటుకు నివేదించి లెక్కలు చెప్పడం తప్పదని అత్యంత అవశ్యమైన ఈ పద్ధతి ఏ మాత్రం మార్చకూడదనీ ఆయన చెబుతున్నారు. ప్రభుత్వం వశపరచుకొన్న పరిశ్రమల జమాఖర్చులను బ్రిటన్‌లో ఆడిటర్ జనరల్

తనిఖీ చేయకపోవడానికి కారణాలు వేరు. అవి అసలు ఇక్కడ వర్తించవు. మన దేశంలో ఆడిటర్ జనరల్‌కు వాణిజ్య వ్యవహారాల ఆడిట్ శాఖ అంటూ ప్రత్యేకం సిబ్బంది ఉంది. చార్టర్డ్ అక్కౌంటెన్సీ చదువుకుని, బాగా అనుభవం, సామర్థ్యం గడించిన ఉద్యోగి అక్కౌంటెంట్ జనరల్ ఈ శాఖను నడిపిస్తూ ఉంటాడు. కాగా, ఇందులో సమర్థులు అయిన చార్టర్డ్ అక్కౌంటెంట్‌లు చాలమంది పనిచేస్తూ ఉంటారు. ఇప్పుడు ఈ శాఖను ఇంకా పటిష్ఠంచేయడానికి ఏర్పాట్లు జరుగుతున్నాయి. ఈ శాఖలో అవకతవకలు జరిగినప్పుడు 'లోపాలు కనబడ్డప్పుడు' మాత్రమే ఆడిటర్ జనరల్ కలుగచేసుకుని పనులు చక్కబెడతారు. లేకపోతే, అనుసరణీయ విధానాలు సూచిస్తూ, అజమాయిషీ మాత్రం చేస్తూ ఉంటారు.

పోతే, మనకీ బ్రిటన్‌కూ సామ్యం ఉన్న సందర్భాలలో - అంటే, ప్రభుత్వం డబ్బు పెట్టకుండా, పూచీకత్తు ఇవ్వటంవంటి వ్యవహారాలలో, మన ఆడిటర్ జనరల్, ఆయా సంస్థల ఆర్థిక వ్యవహారాలను తనిఖీ చేసే అధికారం ఉన్నదని చెప్పకపోవడం మాట అలా ఉండగా, కనీసం, తనిఖీ చేస్తే మంచిదని సూచనప్రాయంగా కూడా అనలేదు.

మాటవరసకి టాటా ఇనుము ఉక్కు కంపెనీ సంగతి చూడండి. ఈ సంస్థకు ప్రపంచ బ్యాంకు రు. పదికోట్లవరకూ అప్పు ఇస్తానంది. ఈ ఋణానికి భారతప్రభుత్వం పూచీ ఇవ్వడానికి అంగీకరించింది. ఇటువంటి సందర్భంలోకూడా, తాము ఈ సంస్థ రాబడి ఖర్చులు తనిఖీచేయడం అవసరమనిగాని, మంచిదనిగాని ఆడిటర్ జనరల్ అనలేదు. వీటి తరహా వేరు; సమాహారనిధినుండి తీసిన డబ్బుతో నడిచే పరిశ్రమల సంగతి వేరు. రాజ్యాంగరీత్యా వీటికి కొన్ని కట్టుదిట్టాలు ఉన్నాయి.

ఇక, పార్లమెంటుకు నివేదించేవిషయం. ప్రభుత్వ పరిశ్రమల స్థితిగతులపై ప్రభుత్వ ఆడిటర్లు కనక సమగ్రమైన నివేదిక సమర్పిస్తే పార్లమెంటు ఆ యా సంస్థలు ఎలానడుస్తున్నదీ కాస్త వివరంగా పరిశీలించడానికి వీలు కలుగుతుంది. ఈ దృష్ట్యా ఇది అవసరం కూడా అయితే నిజానికి, ఈనాడు ఆడిటర్లు కంపెనీలచట్టం నిర్ణయించిన పరిమితులకు లోబడి పనిచేయవలసివస్తోందన్న సంగతి గ్రహించడం అవసరం. లాభనష్టాల పద్దులనుచూసి, సవ్యంగానే ఉన్నట్లు ముద్ర వేయడం వారి ప్రధాన కార్యక్రమం. అంతే తప్ప, అసలుఆయా సంస్థల ఆర్థిక స్థితిగతులు

(56-వ పేజీ చూడండి)



ఈ ఆదర్శమైన క్రీమ్ వాడి అందముగ కనపడండి

ఇది మీ చర్మమును మృదువుగా, అందముగా ఉండేలా చేయును ...లోపములను కనపడనీయక నిష్కళంకముగ ఉంచును

చల్లని, మంచువలెనున్న పాండ్స్ వ్యానిషింగ్ క్రీమ్ వాడి మీరు ఎల్లప్పుడూ మనోహరముగ ఉండండి.

పాండ్స్ వ్యానిషింగ్ క్రీమ్ రోజూ ముఖముపై పైపైన రాసుకోండి. కొన్ని సెకండ్లలోనే అది మాయమవుతుంది... కాని అది ఆశ్చర్యకరముగ చర్మమును నిష్కళంకముగా చేస్తుంది! మీ ముఖము ఎంతో సహజముగ మృదువుగా ఉండుట మీరు చూస్తారు.

ముఖముమీద పౌడరు అంటుకొని ఉంటుంది!

మీరు పౌడరు రాసుకునేప్పుడు లేక మేకప్ చేసుకునే ముందు ప్రతి సారి తెల్లని పాండ్స్ వ్యానిషింగ్ క్రీమ్ పైపైన రాసుకోండి. అది మీ చర్మమును ఏకరీతిగా మృదువుగా చేస్తుంది. లోటులేని మనోహరముగ ఉండుటకు మంచువలెనున్న పాండ్స్ వ్యానిషింగ్ క్రీమ్ వాడండి!




పాండ్స్ వ్యానిషింగ్ క్రీమ్

డిటెక్టివ్ సీరియల్

మూలం: ఎడ్గార్ వాలెస్

# అరుణవలయం

అనువాదం: ప్రద్యుమ్న

## 13. మార్ల్ బెదిరింపు

కొత్తగా అరుణవలయంలో చేరిన థాలియా డ్రమండ్‌కు మంచి ఉద్యోగమే దొరికింది. బ్రబజాన్ ఆమెను నిరభ్యంతరంగా తన బ్యాంకిలో చేర్చుకున్నాడు. కారులోని అజ్ఞాతవ్యక్తికి అంతులేని పలుకుబడి వున్నట్లు దీనివల్ల స్పష్టమవుతోంది.

అయితే విచిత్రమేమంటే ఎన్నిరోజులు గడిచినా ఆ అజ్ఞాతవ్యక్తినుండి థాలియాకు ఎట్టి వర్తమానమూ రాలేదు. తనను అతడు పూర్తిగా ఉపయోగించుకుంటాడని థాలియా భావించింది. కాని బ్రబజాన్స బ్యాంకి (దీని పూర్వపు పేరు సెల్లర్స బ్యాంకి) లో చేరిన నెలరోజుల తరవాత గాని ఆమెకు అరుణవలయంనుండి కబురు రాలేదు. ఒక ఉదయం లేచిచూసేగా బల్ల మీద ఒక లేఖ కనబడింది. దానిమీద అరుణ చిహ్నమేమీ లేదు.

"మార్ల్‌ను పరిచయం చేసుకో. అతనికి బ్రబజాన్‌పై అంత అధికారం ఎక్కణ్ణించి వచ్చిందో తెలుసుకో. మార్ల్‌కు బ్యాంకిలో ఎంత సొమ్ము వుందో తెలుసుకుని, అతడు తనడబ్బంతా తీసివేసుకోగానే నాకు తెలియపరుచు. ఇన్‌స్పెక్టర్ పార్, డిటెక్టివ్ యేల్ అక్కడికి వస్తున్నారేమో తెలుసుకుని నాకు తెలియజెయ్యి. ఈ చిరునామాకు వ్రాయి: "జాక్‌సన్,' 23, మిల్‌డ్రెడ్ వీథి, సిటీ."

ఈ ఆజ్ఞలన్నిటినీ థాలియా చక్కగా నిర్వర్తించింది. కాని మార్ల్‌ను పరిచయం చేసుకోడానికి కొద్దిరోజులు పట్టింది.

డెరిక్ యేల్ బ్యాంకికి ఒక్కసారే వచ్చాడు. బియర్డ్‌మోర్ గృహంలో అతడు అతిథిగా ఉన్నప్పుడు ఒకసారి అతన్ని ఆమె చూసివుంది. చూడకపోయినా, అతని ఫోటో చాలా పత్రికల్లో పడివుండడంచేత తేలికగానే గుర్తుపట్టడానికి వీలుంది.

అతడు ఎందుకు వచ్చాడో ఆమెకు తెలియలేదు. ఆమె బ్రబజాన్‌కు ప్రైవేట్ సెక్రెటరీ గనుక ఆమెకు ప్రత్యేకం ఒక గది కేటాయించబడింది. ఆ గదిలో కూర్చుని, డెరిక్ యేల్ రావడం, కౌంటర్ దగ్గర మనిషితో ఏదో మాట్లాడడం చూసింది. ఈ సంగతి వెంటనే అరుణవలయానికి తెలియపరిచింది.

ఇన్‌స్పెక్టర్ పార్ రాలేదు. జాక్ బియర్డ్‌మోర్ కూడా రాలేదు. అయినా అతన్నిగూర్చి ఆమె శ్రద్ధవహించలేదు.

* * *

సెల్లర్స బ్యాంకి అధిపతి జాన్ బ్రబజాన్ తన ఆఫీసుగదిలో కూర్చున్నాడు. అతన్ని చూస్తేనే గొప్ప ఆందోళనలో ఉన్నాడని తెలుస్తోంది. అతని కెదురుగా స్ఫురద్రూపియైన మరొక వ్యక్తి కూర్చున్నాడు. ఊపిరి పీల్చడానికి ఆయాసపడడం అతని లక్షణం..

"మిస్టర్ మార్ల్!" అని బ్రబజాన్ అతన్ని సంబోధించాడు. అతని గొంతు ప్రాధేయపడుతున్నట్లు మృదువుగా ఉన్నది "మీరు అప్పుడప్పుడు నాకు మరీ సహనం నశించేలాగ ప్రవర్తిస్తారు. ఇక ఆర్థికంగా నాకు మీరు తెచ్చిపెట్టిన ఇబ్బందులు చెప్పనక్కర్లేదు."

మార్ల్ ఇకిలించాడు. "బ్రబజాన్! మీకు సెక్యూరిటీ ఇస్తున్నాను గదా! ఇంకా దేనికి మీకనుమానం?" అన్నాడు.

"మీరు వేసేవన్నీ పనికిమాలిన స్కీములే. ఈ స్కీములన్నిటికీ పెట్టుబడి పెట్టి నేనెంతో నష్టపోయాను. మీకు నేనెందుకు సహాయం చెయ్యాలి? ఈ ఒక్క బ్యాంకిలోనే మీకు దాదాపు లక్ష పౌనులున్నది"

మార్ల్ వెనక్కి తలుపుకేసి చూసి, మళ్లీ ముందుకువంగి కొంచెం నెమ్మదిగా ఇలా అన్నాడు:

"ఒక చిన్న సంగతి చెప్పనా మిస్టర్ బ్రబజాన్! సెల్లర్స బ్యాంకి అధిపతి సెల్లర్ చనిపోగానే అతని వితంతుభార్యను నిర్ధనుడైన ఒక గుమాస్తా వివాహంచేసుకున్నాడు. ఆమె అతనికి తల్లి కాదగినంత పెద్దది. ఆమె స్విట్జర్లెండులో హఠాత్తుగా మరణించింది. ఆమె ఒక కొండమీదినించి అగాధంలో పడి మరణించింది. అది నాకు తెలియదనుకున్నారా? ఆపర్వతదృశ్యాలను నేనప్పుడు ఫోటోలు తీస్తున్నాను. అప్పుడు ఆమె మరణించిన దృశ్యంకూడా నేను ఫోటోతీశాను. అందులో మీరు కూడా ఉన్నారు. మీకెప్పుడైనా అది చూపించానా? లేదు. దాచిపెట్టాను. అవును, ఆ ఫోటోలో మీరుకూడా ఉన్నారు. కాని న్యాయస్థానంలో మీరు సాక్ష్యం చెబుతూ అప్పుడు చాలా మైళ్ల దూరంలో ఉన్నానని అబద్ధమాడి తప్పించుకున్నారు. జ్ఞాపకం ఉందా?"

బ్రబజాన్ తల వాల్చి ఈ కథ వింటున్నాడు. అతని ముఖంలో ఎక్కడా ఏ కదలికా లేదు.

"అదీగాక, మీరు నాకెంతైనా ధనసహాయం చెయ్యగలరు. మళ్ళీ ఇంకొక సంబంధం చూస్తున్నారుగదా మీరు? బాగా డబ్బు కలిసివచ్చే సంబంధంగదూ?" అన్నాడు మార్ల్.

బ్యాంకర్ తల పైకెత్తి కనుబొమలు చిట్లించిచూశాడు.

"ఏమిటి మీ ఉద్దేశం?" అన్నాడు.

మార్ల్ నవ్వు ఆపుకోలేకపోయాడు. పగలబడి నవ్వుతూ మోకాలిమీద చేతులతో చరుచుకున్నాడు.

"అబ్బే, ఏంలేదు. ఆ రోజురాత్రి సేవన్ స్క్వేర్‌లో ఒక కారులో మీరొక వ్యక్తిని కలుసుకున్నారే, దానికేమంటారు? చెబాయిందకండి. మిమ్మల్ని నేనుచూశాను. చాలా చిన్న కారు, ముచ్చటైన కారు! కదూ?"

బ్రబజాన్‌ముఖం ఆందోళనతో వికృతమైంది. కళ్లు లోలోపలికి పోతున్నట్లు తేలిపోయాయి.

"సరే, మీ రడిగిన ఋణానికి ఏర్పాట్లు చేస్తాను", అనేశాడు.

మార్ల్ తన సంతృప్తి ప్రకటించబోతుండగా తలుపుతట్టిన శబ్దమైంది. "రా" అని బ్రబజాన్ ఆజ్ఞాపించాడు. తలుపు తెరుచుకొని థాలియా లోనికి వచ్చింది. ఆమెను చూడగానే ఫెలిక్స మార్ల్ ఆలోచనలన్నీ చెదిరిపోయాయి. ఆమెకేసే తదేకంగా చూడసాగాడు.

థాలియా ఏదో టెలిఫోన్‌వార్త తెచ్చి యజమాని ముందుపెట్టింది.

ఆమెనుచూస్తూ "తెల్లగా - బంగారం



పడవషికారు —ఫొటో: ఎన్ రామకృష్ణ.

లాగా– ఎర్రగా–" అనుకున్నాడు. ఆమె శరీరం తెల్లగా, స్వచ్ఛంగా, సుకుమారంగా ఉంది. పెదవులు ఎర్రని–ఎరుపులో ఉన్నాయి. జుట్టు బంగారంలాగా మెరిసిపోతోంది. ఆమెముఖం ప్రక్కవాటుగా చూశాడు. పెదవులు బిగించుకుని ఉన్నట్లు దృఢంగా ఉన్నాయి. అది అతనికి నచ్చలేదు. తను కౌగిలించుకుంటే మెత్తగా, మంచులాగ కరిగిపోయి, లొంగిపోయే ఆడవాళ్ళంటేనే మార్ల్‌కు ప్రీతి. స్వతంత్ర స్వభావంగల స్త్రీలంటే ఏవగించుకుంటాడు.

ఆమె గదిలోంచి వెళ్ళిపోగానే "ఏం బావుంది, ఏం బావుంది! ఎవరో ఈ పిల్ల? ఎక్కడో చూసినట్లున్నది. ఆమె పేరు?" అని ప్రశ్నించాడు.

"థాలియా డ్రమండ్" అని బ్రబజాక్ కోపంగా సమాధాన మిచ్చాడు.

"థాలియా డ్రమండ్!" అని ఆ పేరొకసారి అనుకుని "ఈమె ఇదివరకు ఫ్రాయంట్ ఇంట్లో ఉండేది కదూ? మీకేమన్నా వ్యవహారము నడుపుతున్నారా ఈమెతో?" అని మార్ల్ అడిగాడు.

"నా దగ్గర ఉద్యోగం చేసే స్త్రీలతో నేను వ్యవహారాలు నడపను. మిస్ డ్రమండ్ బాగా పనిచేయగల సమర్థురాలు. నాకు కావలసిందీ అదే" అని కఠినంగా జవాబిచ్చాడు బ్రబజాన్.

మార్ల్ మళ్ళీ ఇకిలిస్తూ లేచి నుంచున్నాడు.

"సరే. మిమ్మల్ని మళ్ళీ రేపు కలుసుకుంటాను. ఆ విషయం తేల్చుకోవాలిగా!"

మార్ల్ పెద్దగా నవ్వాడు. బ్రబజాన్ మాత్రం చిరునవ్వైనా నవ్వలేదు.

"రేపు పదిన్నరకి కలుసుకుందాం. లేకపోతే పదకొండింటికి కలుసుకుందామా?" బ్రబజాక్ అడిగాడు.

"పదకొండింటికి," అని ఒప్పుకున్నాడు మార్ల్.

మార్ల్ వెళ్ళిపోగానే తలుపులు గడియవేసుకుని బ్రబజాక్ తన కుర్చీలో కూర్చున్నాడు. నోటుబుక్కులోంచి ఒక తెల్లకార్డు తీసి, ఎర్రసిరాలో కలం ముంచి ఒక చిన్నవృత్తం గీశాడు. దానిదిగువ ఇలా వ్రాశాడు.

"మనం స్టేన్ స్క్వేర్‌లో కలుసుకోవడం ఫెలిక్స్ మార్ల్ కంటబడింది. అతడు మారిస్‌బర్గ్ పేటలో 79 వ యింటిలో ఉంటున్నాడు."

ఆ కార్డును ఒక కవరులో పెట్టి "మిస్టర్ జాక్‌సన్, నం. 23, మిల్‌ఫ్రెడ్ వీధి, సిటీ" అని చిరునామా వ్రాశాడు.

## 14. విందుకు పిలుపు

ఫెలిక్స్ మార్ల్ బ్యాంకి హాలులోంచి వెడుతూ అటూ ఇటూ బల్లలవద్ద కూర్చున్న గుమాస్తాలందరినీ చూస్తూ థాలియా కనబడుతుందేమోనని వెదికాడు. కౌంటర్ చివర ఒక చిన్న గది ఉంది. లోపల కూర్చున్న వ్యక్తి కనిపించడం లేదు. తలుపు కొద్దిగా తెరిచి వుంది. లోపలివ్యక్తి ఒక్క రవ్వ కనిపించింది. ఒక్క ఉదుటున తలుపువద్దకు వెళ్ళాడు. హాలులో టైపుచేస్తున్న ఒక యువతి అతన్ని కుతూహలంతో చూస్తూ వుంది.

థాలియా తల పైకెత్తి చూసేసరికి తన మీదికి వంగి చిరునవ్వు నవ్వుతున్న స్ఫురద్రూపి ఫెలిక్స్ మార్ల్ కనబడ్డాడు.

#  అరుణ వలయం 

"పని తొందరలో ఉన్నావా మిస్ డ్రమండ్?"

"అవును" అని జవాబిచ్చింది. కాని అతని రాకను అభ్యంతరం లేనట్టే ముఖం పెట్టింది.

"ఇక్కడ నీకెం తోస్తుంది?"

"ఏమీ తోచదు" అని అతన్ని పరిశీల నగా చూసింది.

"ఒకసారి నాతో రాగూడదూ, సర దాగా ఎక్కడన్నా విందు చేసుకుందాం. ఆతరవాత ఏదన్నా నాటకానికి వెడదాం," అని మార్ల్ ఆహ్వానించాడు.

రంగువేసిన జుట్టునుండి బాగా వార్నీసు కొట్టిన బూట్లదాకా అతన్ని పరీక్షగా చూస్తూ "మిమ్మల్ని చూస్తేనే అసహ్యంగా ఉంది. కాని విందుకు నా అభ్యంతరమేమీ లేదు," అంది థాలియా.

మార్ల్ విశాలంగా నవ్వాడు, పిట్టని లోబరచుకున్నాననే గర్వంతో అతని కళ్లు మెరిశాయి.

"ఈ దగ్గర్లో చిన్న రెస్టరాంటు ఉంది. అక్కడకు వెడదామా?" అన్నాడు. ఆమె ఒప్పుకుంటుందనే అతని నమ్మకం.

"రిట్జ్-కార్ల్టన్‌కి వెడదాము. లేకపోతే మానేద్దాం."

ఆ హోటలు పేరు వినగానే అతడు సంకోచించాడు. తరవాత సంతోషించాడు.

"నువ్వు మహారాణీలా ఉన్నావే. నీకు మహారాణులకు ఉచితమైన భోజనం పెట్టిస్తాను. ఇవ్వాళ రాత్రే వెడదామా?"

ఆమె తల ఊపింది. "సరే; అయితే మారిస్‌బర్గ్ పేటలో మా ఇంటివద్ద ఏడున్నరకి కలుసుకో. తలుపుమీద నా పేరు ఉంటుంది. కనుక సులభంగా కనుక్కోవచ్చు." మార్ల్ ఆమె నిరాకరిస్తుందని భావించి ఆగాడు. కాని ఆమె తన ఇంటికి రావడానికి అంగీకరించడం అతని కాశ్చర్యం కలిగించింది.

అతడు తన వేళ్లు ముద్దు పెట్టుకుని ఆమె కేసి చెయ్యి ఊగించి వెనక్కి తిరిగాడు.

"తలుపువేసి మరీ వెళ్ళండి" అని థాలియా మళ్లీ తనపనిలో మునిగిపోయింది.

కాని మళ్లీ ఆమె పనికి అంతరాయం కలిగింది. ఈసారి లోపలికి వచ్చింది హాలులో టైపు చేస్తున్న అందమైన యువతి.

తలుపులు మూసివేసి రెండో యువతి వచ్చి ఒక కుర్చీలో కూర్చుంది. థాలియా కుర్చీలో వెనక్కి జేరబడి "ఓ, మాక్ రాయ్! ఏమిటి విశేషం?" అని దురుసుగా అడిగింది. అంత అందమైన, సుకుమారమైన యువతి అంత దురుసుగా మాట్లాడటం చూసి మిలీ మాక్ రాయ్ ఆశ్చర్యపడింది.

"ఎవర్తా మునలాడు?" అని మిలీ అడిగింది.

"ఎవడో భక్తుడు!" నిర్లక్ష్యంగా జవాబిచ్చింది థాలియా.

"మగవాళ్లని నువ్వు బాగా ఆకర్షిస్తావే?" అని మిలీ కొంచెం ఈర్ష్యపడుతున్నట్లు అన్నది.

"ఇది మాట్లాడడానికేనా నువ్వు వచ్చింది?"

"కాదు, కొన్ని సంగతులు ముఖాముఖి తేల్చుకుందామని వచ్చాను," అని మిలీ కొంటెనవ్వు నవ్వింది.

"ముఖాముఖి తేల్చుకోవడాలంటే నాకూ ఇష్టమే."

"కిందటి శుక్రవారం పెలింగర్ కార్పొరేషన్‌కు రిజిస్టర్డుపోస్టులో కొంతడబ్బు వెళ్లిన సంగతి జ్ఞాపకం ఉందా?"

థాలియా తల ఊపింది.

"కాని కవరు చేతికందేసరికి వట్టి కాగితం తప్ప అందులో డబ్బులేదని ఆ కార్పొరేషన్‌వారు తెలియజేసిన సంగతి తెలుసా?"

"అలాగా?" అని థాలియా ఆశ్చర్యపడి "బ్రబజాన్ ఆ సంగతి నాకేమీ చెప్పలేదే?" అన్నది. తనను పరీక్షగా చూస్తున్న మిలీని తనుకూడా జంకకుండా తీవ్రంగా చూసింది.

"నేను డబ్బుతీసి ఆ కవర్లో పెట్టాను. సరిగా ఉన్నదీ లేనిదీ చూడడానికి నీకిచ్చాను. నువ్వూ నేనూ తప్ప ఈ వ్యవహారంలో ఇంకెవరూ లేరు. నువ్వో, నేనో డబ్బు కాజేసివుండాలి. నేను కాదని ప్రమాణం చెయ్యగలను," అని మిలీ అన్నది.

థాలియా అమాయకంగా నవ్వుతూ అన్నది: "అయితే నేనే కాజేసి ఉండాలి. ఒక అమాయకస్త్రీమీద ఇంత నిందవేయడం అన్యాయం."

ఆమె గుండెనిబ్బరాన్ని మిలీ మెచ్చుకున్నది.

"నీలాటి ఆడదాన్ని, ఇంత ధైర్యంగా వెధవపనులు చేయగలదాన్ని నేనెక్కడా చూడలేదు. చూడు అమ్మాయ్! మనం నిర్మొహమాటంగా మాటాడుకుందాం. ఒక నెలరోజులకిందట నువ్వు మన బ్యాంకిలో చేరిన వెంటనే, కౌంటర్ దగ్గిర నూరుపౌన్ల నోటు ఒకటి మాయమైంది," అని ఆగింది.

"అయితే?" అంది థాలియా.

"అది మాయంచేసింది నువ్వే. దాన్ని నువ్వు ఎక్కడ మార్చావో, ఆ నోటు నంబరుతో సహా నేను చెప్పగలను."

థాలియా భయపడినట్లు నటిస్తూ "అమ్మబాబో! నీకు చాలా తెలుసునే. ఇక నాపని అఖరే" అని వెక్కిరింతగా అంది.

"నీ గుండె ఇనపగుండె!" అని ఆశ్చర్యపడింది మిలీ. థాలియా భుజంమీద చెయ్యివేసి, "కవరులో డబ్బు దొంగిలింపబడిన సంగతి బయటపడక తప్పదు. నువ్వు చిక్కుల్లో ఇరుక్కోవచ్చు. అప్పుడు నీకు నీ స్నేహితులందరి సహాయమూ అవసరమవుతుంది."

"నీకూ అంతేగా. నేరం నామీదికైనా రావచ్చు నీమీదికైనా రావచ్చు," థాలియా తాపీగా సమాధానమిచ్చింది.

మిలీ "కాని డబ్బు దొంగిలించింది నువ్వు. మిస్ డ్రమండ్! ఈవిషయమై మనం వివాదపడవద్దు. మనిద్దరం ఒకటిగా ఉంటే ఏ చిక్కూరాదు. నేను చూస్తుండగానే నువ్వు ఆకవరు మూసి అతికించావని, అప్పుడు డబ్బు అందులోనే ఉందనీ నేను ప్రమాణం చేస్తాలే" అన్నది.

థాలియా విశ్వబ్దంగా నవ్వుకుంది.

"సరే, నన్ను ఆపదలోంచి రక్షించినందుకు నేను కృతజ్ఞతాసూచకంగా ఏదైనా సహాయం చెయ్యాలిగదూ. ఎందుకొచ్చిన దిదంతా? అడవ్వేమయిందో చెబుతా విను. నేనే తీశాను. అయినా ఈమధ్య తపాలా బట్వాడాలో దొంగతనాలు బోలెడు జరుగుతున్నాయి గనక మరేం ఫరవాలేదు. ఈవిషయమై పేపర్లలో వ్యాసాలుకూడా పడుతున్నాయి."

"నువ్వు నిజంగా ఇనపగుండె మనిషివే" అంది మిలీ. తరవాత ఇలా సలహా ఇచ్చింది.

"ఏమైనా నువ్వు ఇలాంటి చిన్న చిన్న దొంగతనాలు మానివెయ్. లేకపోతే పెద్ద పెద్దఛాన్సులు వచ్చినప్పుడు వ్యవహారమంతా పాడైపోతుంది. నీకు బాగా డబ్బు అవసరమైతే, అందుకోసం భారీఎత్తున పనిచేస్తున్న వారితో కలిసి పనిచేయాలి."

"తెలిసింది. మరి నువ్వెవరితోనయినా పని చేస్తున్నావా?"

"నాకు తెలిసిన పెద్దమనిషి ఒకడున్నాడు—"

"మనిషిఅందూ, పెద్దమనిషి అనడం దేనికి."

"సరే మనిషి అనుకో. అతను నాకు స్నేహితుడే. నిన్ను ఒకటి రెండు వారాల నుంచీ చూస్తున్నాడు. సునాయాసంగా డబ్బు సంపాదించడానికి నువ్వు బాగాపనికి వస్తావని అతని నమ్మకం. నిన్ను అతను కలుసుకోవాలనుకుంటున్నాడు."

"ఇంకో భక్తుడన్నమాట," థాలియా కనుబొమ ఎగరేసింది. మిలీ మాక్ రాయ్ మొహం నల్లబడింది.

([illegible]-వ పేజీ చూడండి)

# ఛత్రపాణి

పి. గణపతిశాస్త్రి

౧

"నిలుచున్నపాటుగా నీవు ప్రసేనజిన్మహారాజు సన్నిధిని రావాలి! ఇది ప్రభువారి ఆజ్ఞ!"

అని హుంకరించాడు రాజకంచుకి! గౌతమబుద్ధదేవుని శ్రీపాదపద్మాలకు సభక్తికంగా ప్రణమిల్లి ధమ్మపదగాథాపారాయణము చేసుకుంటూ నెమ్మది నెమ్మదిగా తన గృహానికి సాగిపోయే ఛత్రపాణి యీ ఆజ్ఞ విని నిలువునా నిర్ఘాంతపోయాడు! రాజకంచుకి ఆ విధంగా తనపై హుంకరించడానికి గల కారణమేమో అతనికి బోధపడలేదు. మహారాజసేవకులెంతటి అల్పాల్పులైనా ప్రభువుల చిత్తవృత్తినిబట్టి ఒక్కొక్కప్పుడు తామే మహారాజులన్నట్టుగా మిడిసిపడిపోవడం కద్దు! కంచుకి ఆవిధంగా మిడిసిపడిపోవడానికి ప్రసేనజిన్మహారాజు చిత్తవృత్తే హేతువై ఉండవచ్చునేమో! మహారాజావిధంగా తనపై ఆగ్రహించడానికి కారణమేమిటి చెప్మా! అని ఛత్రపాణి అనేకవిధాలుగా మథనపడ్డాడు. కాని వెంటనే రాజకంచుకితో కలిసి మహారాజు కొలువుకూటానికి బయలుదేరాడు.

ఛత్రపాణి శ్రావస్తీ నగరంలో చాలా సామాన్య గృహస్థు. తన సంసార జంజాటమేమో తానేమో తప్ప ఇరుగు పొరుగుల గొడవలేమీ పట్టించుకోడు. ఇక రాజాధికారులు, శ్రావస్తీనగరశ్రేష్ఠులు మొదలైనవారి దరిమావానికైనా వెళ్ళడు! ఏదో తనకు కలిగినదానితోనే సంతృప్తిపడి సుఖంగా సంసారయాత్ర సాగించుకుంటున్నాడు.

ఆ నిరంతర సంసారయాత్రలో క్రమంగా అతనికి అరవైయోపడి దాటిపోయింది. కలిగిన సంతానంలో కొంతమంది ప్రయోజకులై చేతికి అందివచ్చారుగాని ఇంకా చిన్నవాళ్లు ఇద్దరు ముగ్గురుదాకా మిగిలారు. ఆ వార్ధకభారంలో క్రుంగి కృశించిపోతూ అతడొకమారు గౌతమదేవుని సందర్శించి బౌద్ధధర్మస్రోతాపన్నుడైనాడు. ప్రశాంతంగా సంసారయాత్ర సాగిస్తూ ఒకరి జోలీ సొంటీ లేకుండా కాలక్షేపం చేసే ఛత్రపాణిని చూచి ఇరుగుపొరుగు గృహస్థులు కొందరు "ఈయన ఎంత బిగువులు పోతాడయ్యా!" అని అనుకోవడం కూడా పరిపాటే! మరికొందరింకా కొంతదూరం దాకా వెళ్ళి అతనికి 'ఛత్రపాణి' అని ఒక నూతన నామధేయంకూడా ప్రసాదించారు. నిజనామధేయమేమైనా కొన్నాళ్ళకదే అతనిపేరై కూర్చుంది.

దానికొక చిన్న కారణంకూడా ఉంది. వీథిలో ఎప్పుడడుగుపెట్టినా అతనికి చేతిలో గొడుగు, కాళ్ళకు పాదరక్షలు ఉండితీరవలసిందే! శిశిరఋతువులోకూడా అతడా గొడుగు లేనిదే వీథిలో అడుగుపెట్టేవాడు కాదు. హోరని వాన పడుతున్నా పాదాలకు పాదరక్షలుండి తీరవలసిందే. అతడవి రెండు ప్రత్యేకంగా తయారుచేయించుకొన్నాడు. లేతలేత తాటిమొవ్వులతో కొత్తగా గొడుగు తయారైవచ్చేసరికి అతని హృదయం ఒక్కమారుగా వేయిరేకుల తామరపువ్వులా వికసించింది! నల్లమద్దిమ్రాను చేవతో తయారయిన పాదరక్షలు తొడుక్కొంగానే అతనిలో ఒక నూతనచైతన్యం ప్రవహించినట్లయింది! అంతకంటె అతనికి ప్రత్యేకంగా చెప్పుకోదగిన భోగభాగ్యాలేవీ లేవు! పదిమందిపిల్లలున్న సంసారయాత్రలో అతని కావిధమైన భోగతృష్ణ ఎన్నడు కలగలేదుకూడాను.

అయితే ఆ గొడుగు, పాదరక్షలు మాత్రం ఎంతో ప్రాణపదంగా చూచుకొంటూండేవాడు. ఇరుగుపొరుగు కొంటెపిల్లలు కొందరది గమనించి అతనికి ఛత్రపాణి అని పేరుపెట్టారు. క్రమంగా అది ఇరుగుపొరుగు పెద్దలకు కూడా అలవాటయింది. పడ్డవాళ్ళెన్నడు చెడ్డవారు కారుగదా! అని అతడా మాట వినీవినిపించుకోనట్లుగా తలవంచుకు వెళ్ళిపోయేవాడు. అలాగ ఎవరి మనస్సు నొప్పించకుండా తప్పించుకు తిరిగే తననీ విధంగా ప్రసేనజన్మహారాజాహ్వానించవలసినంత అవసరం ఏమికలిగింది? అంతటి ప్రభువులకు తనవంటి అల్పులతో ప్రసంగించవలసిన అవసరం ఏమి ఉంటుంది కనక! అని అనేకవిధాలుగా మథనపడ్డాడు ఛత్రపాణి.

కొంతసేపటికి కంచుకితో కలిసి ప్రసేనజిన్మహారాజు కొలువుకూటం చేరుకున్నాడు. జీవితంలో ఎన్నడు అతడా కొలువుకూటం సందర్శించి ఉండలేదు. సువర్ణసింహాసనంతో తళతళలాడే కొలువుకూటం చూచేసరికతని కళ్లు జిగేలుమన్నాయి. అంతలోనే కంచుకి అక్కడినించి వెళ్లిపోయాడు. తన రాక ప్రభువులకు తెలుపుడు చెయ్యడానికే కంచుకి లోపలికి వెళ్లిఉంటాడని ఛత్రపాణి ఊహించుకొన్నాడు. అయితే అతనికి ఏమి చెయ్యడానికీ పాలుపోలేదు. ఎక్కడైనా కూర్చుంటే ఏమితప్పో! ఊరికే అలాగ నిలబడివుంటే ఏమితప్పో! అని అనేకవిధాలుగా తటపటాయించాడు. చివరికక్కడ ఎవరు లేకపోయినా రెండుచేతులతోను నుదుటిపై దోసిలికట్టి అత్యంత భయభక్తులతో మహారాజు రాక ఎదురుచూస్తూ నిలుచున్నాడు.

కొంతసేపటికి మహారాజు కొలువుకూటంలో ప్రవేశించాడు. ఠీవిగా సింహాసనంమీద కూర్చున్నాడు.

మహారాజు కొలువుకూటం లోపల అడుగుపెట్టగానే ఛత్రపాణి ఆయన కొకమారు నమస్కరించి తిరిగీ అలాగే నుదుటిపై దోసిలిఒగ్గ నిలుచున్నాడు. అలాగ కొంతసేపు గడిచిపోయింది. క్రమంగా కొంతసేపటికి ఛత్రపాణికి మహారాజు తనవైపు తిలకించాడా లేదా అని అనుమానం బయలుదేరింది. ప్రసేనజిత్తు లోపలికి వస్తూనే సింహాసనంమీద కూర్చుని నిరంతర రాజ్యకార్యతత్పరతలో నిమగ్నుడైనాడు. పార్శ్వాలలో నిలుచున్న చామరగ్రాహిణులిద్దరు అలవోకగా ఆయనకు వింజామరలు వీస్తున్నారు. అలాగలాగ ఒక అరగడియ గడిచిపోయింది. అయినా ప్రసేనజిత్తు ఛత్రపాణివైపు పాకమారైనా కన్నెత్తి చూడలేదు. 'ఒకవేళ చూచినా చూడనట్లుగానే నటి

ప్రాచీన గాథాలహరి

# ★ ఛత్రపాణి ★

స్తున్నారేమో మహారాజా!' అనుకొన్నాడు ఛత్రపాణి! అదీగాక మహారాజాముఖంలో క్రోధరక్తిమ కూడా పొడకట్టింది. ఛత్రపాణి మళ్లీ మథనలో పడ్డాడు. అంతలో హఠాత్తుగా అతనికి గత దివసం సాయంకాలవేళ తథాగతుని చరణసన్నిధిని జరిగిన వృత్తాంతం అంతా జ్ఞాపకం వచ్చింది. వెంటనే మహారాజ క్రోధానికొకవేళ అదే కారణమేమో అని అనిపించింది. కాని దానిలో అతనికి తన తప్పిదమేమీ కనిపించలేదు. అయినా అతనికా విషయం అంతా స్ఫురణకు రావడానికి కొక చిన్న కారణం కూడా లేకపోలేదు.

## 2

శాక్యసింహుడు శ్రావస్తీనగరానికి విచ్చేసినప్పటినించీ ఛత్రపాణి ప్రతిదినము సాయంకాలవేళ ఆయన దర్శనం చేసుకోనిదే నిద్రపోయేవాడు కాదు. ఏకభుక్తం చేసి ధర్మగాథాపారాయణంతోనే తనకాలం అంతా వెళ్లబుచ్చుకొనేవాడు.

ఛత్రపాణి గత దివసం సాయంకాలం వేళ గౌతమదేవుని దర్శనం చేసినప్పుడు తలవని తలంపుగా ఒక చిన్న విశేషం జరిగింది.

ఛత్రపాణి అత్యంత భక్తిశ్రద్ధలతో తథాగతుని ఉపదేశాలాలకిస్తున్నాడు. సరిగ్గా అదేసమయంలో ప్రసేనజిన్మహారాజక్కడికి విచ్చేయనున్నారనేవార్త అతని చెవుల బడింది. అయినా అతడావిషయం ఆలోచించకుండా అలాగే కూర్చుని బుద్ధదేవుని ఉపదేశామృతం ఆస్వాదిస్తున్నాడు.

అంతలోనే మహారాజా లోపలికి విచ్చేశాడు. సవినయంగా బుద్ధదేవునికి నమస్కరించి ఒక నిమిషంసేపలాగే నిలుచున్నాడు.

ఆయన తథాగతుని సన్నిధికిరాగానే ఛత్రపాణి లేచి నిలబడి, సవినయంగా ప్రత్యభివాదం చెయ్యాలని అనుకున్నాడు. కాని ఉత్తరక్షణంలోనే ఆ సంకల్పం విరమించుకొని అలాగే కూర్చున్నాడు.

మహారాజది గమనించాడు. వెంటనేఅతని కన్నులెర్రబడ్డాయి. అయినా ఆ కోపం అంతా లోలోపలే సంబాళించుకొని ఛత్రపాణికి కొంచెం దూరంగా కూర్చున్నాడు.

శాక్యసింహుడది గమనించకపోలేదు. అయినా అది గమనించనట్లుగానే చిరునవ్వులు చిలకరిస్తూ ప్రశాంతస్వరంతో ప్రసేనజిన్మహారాజుతో ఇలాగన్నాడు:

"మహారాజా! ఈయన శ్రావస్తీనగరంలో శ్రావకోత్తములు! అష్టాంగమార్గస్రోతాపన్నులు! త్రిపిటక విద్వాంసులు! ధర్మనిర్వహణంలో బహుశ్రద్ధాళువులు."

అని సమ్యక్సంబుద్ధుడొకమారు ప్రసేనజిత్తువైపు తిలకించాడు. ప్రసేనజిత్తు భక్తిపూర్వకంగా అంజలిఘటించి ఆయనచెప్పినదన్నీ అతిశ్రద్ధగా ఆలకించాడు. ఒకమారు మూచీమూడనట్టుగా ఛత్రపాణివైపు చూచాడు. అంతేగాని "ఓహో! అలాగా!" అనికూడా అనలేదు.

తథాగతుడంతటి మహామహుడు తనవంటివానిని గూర్చి ఆ విధంగా ప్రసంగించేసరికి ఛత్రపాణి శరీరం పులకరించింది. కంఠంలో గద్గదం బొడచూపింది. ఏదో చెప్పబోయాడు గాని చివరికేమీ అనలేక తిరిగీ బుద్ధదేవుని కొకమారు నమస్కరించి తలవంచుకొన్నాడు. అతని కనుగొలుకులలో బాష్పబిందువులు ప్రవహించాయి.

కోసలదేశాధిపతి ప్రసేనజిన్మహారాజు గుణగణాలభివర్ణించకుండా తనవంటి సామాన్యగృహస్థునుగూర్చి అంత ఆప్యాయంగా ప్రసంగించేసరికి ఛత్రపాణి నిలువునా కరిగిపోయాడు. అయితే అదంతా గౌతమదేవుని అపార కారుణ్యానికే నిదర్శనమనీ, నిజంగా తనలో అంతటి మహత్త్వమేమీ లేదనీ అనుకొన్నాడు. తనవంటి మహారాజక్కడికి విచ్చేయగానే ఛత్రపాణి వెంటనే లేచి ప్రత్యభివాదనం చెయ్యలేదని మహారాజు లోలోపల అట్టుడుకినట్టుడికిపోతున్నాడు. కాని పైకదేమీ కనబడనీయకుండా కుంభనగా ఒక చిరునవ్వునవ్వి గౌతమదేవునికి పాదాభివందనంచేసి ఆయన కనతిదూరంలో కూర్చుని ధర్మబోధ లాలకిస్తున్నాడు. ఆపైన గౌతమదేవుడు మహారాజునుగూర్చి పల్లెత్తు మాటయినా మాటాడకుండా ఛత్రపాణి శ్రద్ధాభక్తులనుగూర్చి ప్రసంగించడం జరిగింది. దానితో ప్రసేనజిత్తు హృదయానికొక పెద్ద అఘాతం తగిలినట్లయింది. అయినా మహారాజత్యంత కౌశలంతో అదంతా లోలోపలే నిగ్రహించుకొన్నాడు. అత్యంత భక్తిశ్రద్ధలతో బుద్ధదేవుని ధర్మబోధ లాలకిస్తున్నట్టు నటించాడు. కాని అతని హృదయం అక్కడలేదు. వెంటనే బయలుదేరి స్వీయభవనానికి వెళ్లిపోవాలని ఉవ్విళ్లూరాడు.

అంతలో బుద్ధదేవుని ధర్మోపదేశంలో ఒక ఘట్టం ముగిసింది. ప్రసేనజిత్తు అది గ్రహించి వెంటనే ఆయనదగ్గర సెలవు తీసుకుని రాజభవనానికి వెళ్ళిపోయాడు. సమ్యక్సంబుద్ధుడు తన ధర్మప్రసంగం ముగించి లేచివెళ్ళేవరకు ఎవరు అక్కడనించి కదలరు. కాని ప్రసేనజిత్తు ఆనాడేదో అత్యావశ్యక రాజ్యకార్యం నిర్వహింపవలసి ఉన్నదని చెప్పి నెమ్మదిగా అక్కడినుంచి బైటపడ్డాడు.

ఆయన ఆ విధంగా కదిలి వెళ్ళిపోవడం ఛత్రపాణికెంతో విచిత్రంగా కనిపించింది. అయినా గౌతమదేవుని నోట వెలువడే ప్రత్యక్షరము అతిశ్రద్ధగా ఆలకిస్తున్న అతని హృదయంలో ఆ భావం వెంటనే అదృశ్యమైపోయింది.

మరికొంతసేపు ధర్మప్రసంగం జరిగింది. ప్రసంగం ముగియగానే తథాగతుడక్కడినించి లేచి వెళ్ళిపోయాడు. ఛత్రపాణి తిరిగీ ఇంకొకమారాయనకు పాదాభివందనం చేసి, మళ్లీ తన పాదరక్షలు, ఛత్రము ధరించి నెమ్మదిగా ధర్మగాథాపారాయణం చేసుకుంటూ తన ఇంటికి వెళ్ళిపోయాడు.

ఈనాడు మహారాజసన్నిధిని అరగడియ సేపు నిలబడేదాకా అతనికీవిషయాలన్నీ స్ఫురణకు రానేలేదు! కాని ఇప్పుడీ విషయంలో అతని అనుమానం అంతా తీరిపోయింది.

## 3

ఛత్రపాణి కోసలదేశాధిపతి ప్రసేనజిన్మహారాజు సన్నిధిని నిలబడిన పిమ్మట ఇంకొక అరగడియకూడా గడిచిపోయింది. ఛత్రపాణికి నిలువు జీతంవల్ల లోలోపల, పైన ముచ్చెమటలు పోశాయి. ఆ తరువాత అలాగే ఇంకొక అరగడియకూడా గడిచిపోయింది.

ఛత్రపాణి చాలా సరళవర్తనుడు. కాని మాట, మంతీ లేకుండా మహారాజు కదురుగా గడియన్నరసేపు నిలబెట్టేసరికి అతని ఓరిమి కాస్తా అంతరించిపోయింది. ఎంతటి మహారాజయితేమాత్రం! తమకు కలిగిన కలిమి అంతా రెండుచేతులా జుర్రుకుంటారు గాని మావంటి అల్పులకేమయినా విలువుతారా ఏమన్నానా! ఎందుకిందటి మిడిసిపాటు! అనుకున్నాడు ఛత్రపాణి.

అంతలోనే మహారాజు జలపోకగా అతిహేళగా కనురెత్తి అతనివైపు చూచాడు.

"ఓహో! ఛత్రపాణి శ్రావకోత్తరములా?"

"చిత్తం! మహాప్రభూ!"

"శ్వేతచ్ఛత్రము, పాదుకలు ధరించ



సుండా విజయం చేశారే!" ఈమాట సూటిగా ఛత్రపాణి గుండెల్లో గుచ్చుకుంది. "మహారాజసన్నిధినికూడా గొడుగు పావలు వేసుకునేటంతటి పామరుణ్ణి కాను మహారాజా!" అన్నాడు ఛత్రపాణి. అతని నుదుటిపై నిలిచిన అంజలి బంధం మరింత దృఢంగా బిగిసింది. అయితే ప్రసేనజిన్మహారాజు ముఖభంగిమలో బిగువు కొంచెం సడలింది:

"అయితే మీకు తెలుసునన్నమాటే!" అన్నాడు.

"ఏమిటది మహారాజా!"

"అదే! మీరంటూన్నమాటే!—నేను మహారాజునన్న విషయం!"

ఛత్రపాణి కదేమీ బోధపడలేదు. కొంచెం కంగారుపడి మళ్ళీ అతివినయంగా ఇలాగ అన్నాడు:

"తమరు కోసల మహారాజులు కారని నేనెన్నడు కలలోనైనా భావించి ఉండలేదే!"

"భావించాలేమోనని అనుకోవలసి వచ్చింది!"

"ఎప్పుడు?"

"నిన్న సాయంకాలవేళ! తథాగతుల సన్నిధిలో!"

ఈ మాటతో ఛత్రపాణికంతా బోధపడిపోయింది. అయినా తన అమాయికత తెలుపుచేస్తూ సవినయంగా ఇలా గడిగాడు:

"నావల్ల ఏమైనా అపచారంగాని జరిగిందా?"

"అంతటి అపచార మేమీ జరగలేదుగాని నేను కోసలదేశాధీశ్వరుణ్ణనే విషయమే మీకు తెలియదేమోనని అనుకున్నాను. అంతే!"

ఈ ప్రత్యుత్తరంతో ప్రసేనజిత్తుచేసిన అధిక్షేపం అంతా ఛత్రపాణికి తెలిసిపోయింది. అతడలాగే ఫాలంపై అంజలిబంధం ఘటించి కొంచెం వ్యంగ్యధోరణిలో ఇలాగన్నాడు:

"మహారాజా! తామూ కేవలం కోసలదేశాధీశ్వరులుమాత్రమే! అయితే మహారాజాధిరాజు లెందరెందరో తథాగతుల పాదపద్మరేణువులు తమ శిరస్సులపై అలంకరించుకొంటున్నారు! సమ్యక్సంబుద్ధులు చతుర్దశభువనాలు తమ చల్లని చూపులతో పరిపాలించే రాజరాజేశ్వరులు! అయినా వారపార కరుణాసాగరులు! అటువంటివారి సన్నిధిలో తమ కభివాదం చెయ్యడం తమకే ప్రత్యవాయహేతువు కాగలదనే భయంతోనే నేను తమ కభివాదనం చేసి ఉండలేదు. అదీగాక క్షణభంగురములైన భాగ్యభోగాలు చూచుకొని అంతగా అహంకరించవలసిందిమాత్రం ఏమిఉన్నది మహారాజా! అందులోను శాక్యసింహులవంటివారి సన్నిధికివెళ్లినా, ఇంకా ఈ క్షుద్రాహంకారాల ఆర్భాటమేనా? ఇంతకీ నావంటి అల్పాల్పుడు తమకు ప్రత్యేకంగా విన్నవించవలసినదిమాత్రం ఏమిఉన్నది మహారాజా!" అని ఛత్రపాణి ఒక చిన్న చిరునవ్వు విసిరాడు.

ఈ ప్రత్యుత్తరంతో ప్రసేనజిత్తు పూర్తిగా చిత్తయిపోయాడు. అతనికిక నోటిమాట రాలేదు. అయినా కొంచెం సంబాళించుకుని అతికష్టంమీద ఒక చిరునవ్వునవ్వి "అవునవును! నాకది తెలియకపోలేదు! ఇంతకీ మిమ్మల్నిక్కడికి పిలిపించిన కారణం వేరు!" అన్నాడు.

నిజానికి ప్రసేనజిత్తు ఛత్రపాణి నక్కడికి పిలిపించిన దందుకోసమే. అతడు లోనికి రాగానే తన అక్కసంతా ఒక్కసారిగా వెళ్లగక్కాలని అనుకున్నాడు. అయితే అమాయిక సరళము, సుప్రసన్నము అయిన ఛత్రపాణి ముఖం చూడగానే మహారాజు క్రోధం చాలావరకు చల్లారిపోయింది. ఆపైన ఛత్రపాణి సాభిప్రాయంగా విసిరిన విసుర్లు వినగానే అతని హృదయంలో కొంచెం పశ్చాత్తాపంకూడా బయలుదేరింది.

అయితే అదేసమయంలో మహారాజు మనస్సులో ఒక చిన్న ఆలోచన స్ఫురించింది. ఛత్రపాణిపై అనుగ్రహదృష్టి ప్రసరింపచెయ్యాలనీ, ఆవిధంగా తిరిగీ అతనిని కొంచెం కించపరచాలనీ అనుకున్నాడు. అల్పులపై అహంకారాధికారాలు చలాయించలేనివారు తమ అనుగ్రహంద్వారా వారిని కించపరచాలని అనుకుంటారు. ఇది మానవహృదయంలో ఉదయించే అతిసూక్ష్మమైన క్రూర ప్రతీకారదృష్టి!

కోసలాధిపతికి సరిగా అలాంటి సంకల్పమే కలిగింది. ఆవిధంగా ఛత్రపాణిపై తిరిగీ తన మహాత్త్వం ప్రతిష్ఠింపచెయ్యవచ్చుననీ తద్వారా అతని అల్పత్వం నిర్దేశించవచ్చుననీ అనుకున్నాడు. ఇదంతా ప్రసేనజిత్తు హృదయాంతరాళంలో స్పష్టాస్పష్టంగా, తలవని తలంపుగా బయలుదేరిన ఆలోచన. వెంటనే లోలోపలలేని ఆదరాభిమానాలు వ్యక్తీకరిస్తూ మెత్తగా ఇలాగన్నాడు:

"మిమ్మల్ని నేనొక చిన్న సాహాయ్యం అర్థిస్తున్నాను!"

"నేనా? తమకా? సాహాయ్యం చెయ్యడమా? ఎంతమాట సెలవిచ్చారు!"

"తథాగతులు మిమ్మల్ని సాక్షాత్తు జ్ఞానాభరణులని ప్రశంసించి ఉన్నారు."

"అది కేవలం వారి అపార కరుణకు మాత్రమే తార్కాణం! అంతే! ఇంతకీ తమ ఆజ్ఞ?"

"మహారాణులు మీదగ్గర త్రిపిటక ధర్మ ప్రవచనం వినవలెనని కుతూహలపడుతున్నారు!"

దానికి చత్రపాణి తిరిగీ అతి వినయంగా ప్రత్యుత్తరం ఇచ్చాడు:

"మహారాజా! అవన్నీ శారీపుత్ర మౌద్గల్యాయనుల వంటివారో, లేక సాక్షాత్తు తథాగతులోని వ్యాఖ్యానించవలసిన విషయాలు! నేనీ విషయాలలో కేవలం అజ్ఞుణ్ణి! నన్ను మన్నించండి!"

అది విని మహారాజు—"మీరు తిరిగీ నన్ను కించపరుస్తున్నారు!" అన్నాడు.

"ఎంతమాట! మిమ్మల్ని కించపరచడానికి మే మెంతటివాళ్ళం! అదీ గాక నేను బొత్తిగా రాజమర్యాద తెలియని పామరుణ్ణి! ఆపైన అంతఃపురమర్యాదలకు నాసలే తెలియక! దయ ఉంచి నాకిక సెలవిప్పించండి! ఇది నావల్ల జరిగేపనిగాదు, గౌతమ బుద్ధులకు తమ అభిలాష తెలియజేస్తే వెంటనే వారర్హతుల నెవరినైనా తమ అంతఃపురానికి పంపించగలరు! నామీద అనుగ్రహంకొద్దీ తమరిలాగ సెలవిచ్చారు గాని నేనందుకు తగినవాణ్ణిగాను. ఇక నాకు సెలవా మరి!" అన్నాడు ఛత్రపాణి.

తన ప్రార్థన విని ఛత్రపాణి ఉబ్బితబ్బిబ్బైపోగలడనీ ఆవిధంగా తన మహాత్త్వం అతనికి చవిచూపించవచ్చుననీ ప్రసేనజిత్తెంతో ఉబలాటపడ్డాడు. కాని అది నెరవేరలేదు. అతనికి జరిగిపోయినదానికంటె ఇదే ఒక గొప్ప అవమానంగా కనిపించింది! అయినా ఇక ఏమనడానికీ పాలుపోక ఒక్క చిరునవ్వు నవ్వాడు:

"సరే మరి! మీవంటివారిలాగంటే ఇక నే నేమనగలను!"

ఛత్రపాణి ఆమాట వింటూనే మహారాజుపై ఒక నమస్కారం బాణం విసిరి వెంటనే ఒక్క అంగలో రాజభవనందాటి ఇవతల పడ్డాడు!

వెనక్కి తిరగగానే అతని కొక పెద్ద నిట్టూర్పు వినిపించింది! ★







[గత సంచిక తరవాయి]

ఈ అడవిపొదలమధ్య, రాండిపోయిన సీతాఫలం చెట్లఆకులమధ్య ఖర్జూర చెట్లక్రింద, ఎండిరాలిన ఖర్జూరమట్టలప్రక్కన కూర్చుని, నిజమైన అన్నం, కూర వండుకుతినటం!

తింటూ తింటూ దుర్గ అపూకేసి చూసి హిహిహీ అని నవ్వింది. ఆ సంతోషంలో ముద్ద గొంతుకు అడ్డంపడి పొరబోయింది. బినీ తింటూ తింటూ భయ భయంగా "కొంచెం నూనె వుందా దుర్గాదీ? 'మేటే ఆలూ' అన్నంలో కలిపేసుకుంటాను" అన్నది. "అపూ, ఒక్క పరుగున వెళ్ళి కాస్త నూనె తీసుకురారా" అన్నది దుర్గ.

అనువాదం:

## మద్దిపట్ల సూరి

ఆనందోత్సాహాలతో వెలుగుబాటలు విరిసి, ఎప్పటికప్పుడు గగుర్పాటు కలిగించే మధురజీవితాల కిదే ప్రారంభం. వీళ్ళకి.

క్రమంగా దూరదూరాలకు దృష్టిని విస్తరింపచేసే ఈ ఆనందజీవితపథంలో వీళ్ళు పరిగెత్తే బాటసారులు. ఆ మార్గపు మలుపుల్లోకి, ఫలపుష్పాలకి, సుఖదుఃఖాల్లోకి వీరి అభ్యర్థన పరిక్రాంతది.

ఆనందం! ఆనందం! విస్తృతమవుతున్న ఆనందం! జీవితంలో మధ్యమధ్య ఏ అవాంతరాలున్నాయో, తుషార ధవళ శిఖరాల కవతల ఏమున్నదో కనిపించనీయని ఆనందం, వాళ్ళ ఆనందం!

అతి సామాన్యములైన చిన్న వస్తువులతో చవిచూసిన అమందానందం!

"అమ్మతో ఏమని చెబుదాం అక్కా? సాయంత్రం మళ్ళీ అన్నం తిందామా?" అని అడిగాడు అపూ.



అపూ, దుర్గా, బినీ

"ఈ అడవి పొదలమధ్య...నిజమైన అన్నం, కూర వండుకుతినటం!"

చిత్రకారుడు : దివాకర్ సేన్ శాంతి—కలకత్తా

**జరిగిన కథ:—**

నిశ్చిందిపురం బెంగాల్‌లోని మారుమూల కుగ్రామం. ఆ ఊళ్లో చితికిపోయిన మధ్య తరగతి సంసారి హరిహరరాయ్. అతని భార్య సర్వజయ. కూతురు దుర్గ. హరిహరరాయ్ పెళ్ళయిన తరవాత కొంతకాలం దేశాలు పట్టిపోయి, శాస్త్రాలు, కావ్యాలు చదివి పండితుడై, ఐదేళ్ళకి తిరిగివచ్చి కాపరంపెట్టాడు. దుర్గ పుట్టిన చాలఏళ్ళకి అతనికి కొడుకు పుట్టాడు. వాడిపేరు అపూ. ఇంట్లో ఎప్పుడుచూసినా 'ఇవాళ ఎలా గడుస్తుందిరా భగవంతుడా' అనే చింతే. కాని పిల్లల కిదేం పట్టింది? దుర్గకి ఒక్కనిమిషం ఇంట్లో కాలు నిలవదు. ఎప్పుడూ ఏ తోటలోనో, ఏ చెట్టుకిందనో ఆడుకుంటూ ఉంటుంది. అపూ ఎప్పుడూ ఊహాలోకంలోనే గడుపుతాడు. వాడికి ప్రతిదీ కొత్తే. ప్రతిదీవింతే. వాడి జీవితపరిధిలోకివచ్చే ప్రతి సాధారణవిషయమూ అసాధారణమైనదిగా, అద్భుతమైనదిగా వాడికి కనిపిస్తుంది. ఒకరోజున అపూను బళ్లోవేశారు. చదువుచెప్పడంకంటె, బడిలోనే ఒకపక్కనఉన్న చిల్లర కొట్టుపని చూసుకోవడం, కొట్టుకు వచ్చేపోయేవారితో కబుర్లుచెప్పడమే పంతులుగారికి అలవాటైంది. కొట్లోకివచ్చే గ్రామస్థుల కబుర్లు వింటూ అపూ ఏవో ఆలోచనల్లో తేలిపోతూ ఉండేవాడు. పంతులు ఎప్పుడైనా పాఠంచెప్పినా ఆ మాటలు వాడికి అర్థంఅయ్యేవికావు. అర్థంకాని ఆ శబ్ద సముదాయం వెనక వాడికి ఏవో చిత్రవిచిత్రమైన రమణీయలోకాలు, దేశకాలబాధితంకాని ప్రపంచాలు కనిపించేవి. పెద్దవాడైన తరవాత దారికనుక్కుని అక్కడికి వెళ్ళాలని వాడు నిశ్చయించుకున్నాడు. ఆఊరికి కొత్తగా పట్నంనించి నీరేన్ అనే విద్యాధికుడు, ధనాఢ్యుడు వచ్చాడు. అతన్ని చూసి అతడే తనకు భర్తకావాలని దుర్గ కోరుకుంది. తనకోరిక గొంతెమ్మకోరిక అని ఆ పిల్లకు తెలియదు.

# ★ పథేర్ పాంచాలి ★

"ఫో, అమ్మతో చెపుతారా ముక్కిడివా? సాయంకాలానికి చూడు ఆకలి వేస్తుంది మళ్లీ"—

జోగి బ్రాహ్మణుడు వచ్చి మంచినీళ్లడిగితే, అతడు త్రాగిన చెంబు మళ్లీ శుద్ధిచేసి తోముకోవాలి. బినీ కొంచెంసేపు సందేహించి అపూ గ్లాసుకేసి చూపిస్తూ "నా నోట్లో కాసిని నీళ్లుపోస్తావా అపూ! గొంతు తడారిపోతోంది" అన్నది. తీసుకో బినీది! "తీసుకుని నోటిదగ్గర పెట్టుకుని త్రాగరాదూ?" అన్నాడు అపూ.

అయినా బినీకి ధైర్యం చాలేదు. "తీసుకో బినీ, గ్లాసు తీసుకుని త్రాగు" అన్నది దుర్గ.

భోజనాలవి అయాక "ఆ పిడత పారేసుకోవద్దు, మళ్ళీ ఇంకోసారి ఎప్పుడైనా పనికివస్తుంది. ఏం! ఈ రాగిచెట్టు కొమ్మకు తగిలించి ఉంచుదాం" అన్నది దుర్గ.

"అఁ అక్కడ పెడితే ఉంటుందాయేం? మాతూవాళ్ళమ్మ పుల్లలేరుకోటాని కిటు వచ్చినప్పుడు కన్పిస్తే చాలు ఎత్తుకుపోతుంది. భలే దొంగ" అన్నాడు అపూ.

ఓ పడిపోయిన గోడకంతలో ఆ పిడతను దాచింది దుర్గ.

అపూ గుండె దడదడ కొట్టుకుంటుంది. కంతకి పైగా ఉన్న ఇంకో [illegible] ఒక సిగరెట్ దాచుకున్నాడు. అక్కడికి వెదుకుతుందేమో అక్క!

'సేదా' వాళ్ళ యింటికి కొద్దిరోజుల క్రితం 'సేదా' బావ, అతడి స్నేహితుడు వచ్చారు. వాళ్ళది కలకత్తాదగ్గరలో ఏదో ఊరు. దర్జాగా ఉంటాడు, సిగరెట్లు తెగ కాలుస్తాడు. కాల్చిపారేసి మళ్ళీ అప్పుడే ఇంకోకటి వెలిగిస్తాడు.

సిగరెట్ కాలిస్తే ఎలా ఉంటుందో ఒకసారి చూడాలనుకున్నాడు అపూ. వాడు సేదాతో గుసగుసలాడి, ఊళ్లో హరీశ్ జోగి కొట్లో మూడుకాన్లు ఇచ్చి, పైన రంగు కాగితంముక్క చుట్టిన పది సిగరెట్లు కొనుక్కుని వచ్చాడు. అరోజున బాగా చెట్ల గుబురుమధ్యకు వెళ్లి, ఒక్కడూ సిగరెట్ కాలుస్తూ కూర్చున్నాడు. బాగుండలా, ఏమిటో చేదుగా తిప్పుతున్నట్లుంది. రెండు గుక్కలు లాగి, ఇంక కాల్చలేకపోయాడు. కాని తనవంతు వున్న మిగిలిన నాలుగు సిగరెట్లూ పారెయ్యలేకపోయాడు. సేదా బావదగ్గర ఖాళీపెట్టె ఒకటి తీసుకుని అందులో యీ సిగరెట్లు వాలుగా పెట్టి, యీ పాడుబడ్డ చోట [illegible]కంతలో దాచాడు దాన్ని.

మొదట సిగరెట్ కాల్చినరోజున-కాల్చటం అవగానే అమ్మ వాసన ఎక్కడ పట్టేస్తుందో అని వాడికి గుండెల్లో రాయిపడింది. బోలెడన్ని లేతపళ్లు నమిలి, 'ఉఫ్ ఉఫ్' అని అరచేతుల్లోకి ఆదిరిపట్టి అది వాసన చూసుకుని పరీక్షించుకుని, మళ్లీపోయి మామూలు మనుషుల్లో కలిశాడు — ఇవాళ ఇంకేముంది వస్తువుతో సహా పట్టుపడిపోవాల్సివస్తుందల్లే ఉంది!

కాని అక్కకి గోడ కట్టుపైకి వెళ్లవలసిన అవసరం కలగలేదు. ఆ పని ఇక్కడే అయిపోయింది.

## 21

సర్వజయ ఏటికి నీళ్లకివెళ్లి వచ్చాక విన్నదీ సంగతి.

కొన్నాళ్ళనుంచి నీరేన్‌కి అన్నదా రాయ్‌తో — ముఖ్యంగా అతడి కొడుకు గోకుల్‌తో సుతరాం పడటంలేదట! నిన్న మధ్యాహ్నం పెద్దతగాదా అయిందిట! దానికి పర్యవసానంగా నిన్నరాత్రే నీరేన్ సామాన్లూ అవీ తీసుకుని ఇక్కడినుంచి వెళ్లిపోయాడుట! అన్నదా రాయ్‌గారింటి ప్రక్కనుంచే యజ్ఞేశ్వరదీక్షితుడి భార్య హరిమతి ఎవరితోనో అంటున్నది—"నిజమో

అబద్ధమో తెలియదుకాని, కొన్నాళ్లనుంచి వీళ్లో రకరకాలమాటలు వినిపడుతున్నాయమ్మా! నేనుమాత్రం నమ్మలేదు,—ఆ పిల్ల అలాంటిదికాదని నానమ్మకం. కాని తర్వాత నీరేన్ దానికి చాటుగా డబ్బుఇచ్చాడని విన్నాను. ఆ పిల్ల ఆ డబ్బు ఎక్కడికో పంపించిందట: నీరేన్ దస్తూరీలో ఉన్న తిరుగు రసీదు గోకుల్ చేతికి చిక్కిందిట:— ఎందుకులే బాబూ! పరాయివాళ్ల నిగురించిన పాడుమాటలు వింటే వింవస్తుంది మనకు. 'మీరంతా కలసి ఒక్క వ్యక్తిమీద అత్యాచారానికి పూనుకోవటం-అదిమాత్రం తప్పుకాదా యేం? మీరన్నయినా అనుకోండి, వదిన కనుక అనుజ్ఞ ఇస్తే నేనామెని నెత్తిన పెట్టుకుని తీసుకువెళ్లగలను. ఆ తర్వాత మీయిష్టం ఏంచేసుకుంటారో చేసుకోండి' అన్నాడట నీరేన్. తర్వాత ఇహ చాలా పెద్ద గొడవ, అల్లరి అయింది. సంజెపడుతుండగా గొల్లగూడెంనుంచి పిలిపించుకుని సామానులవీ వేసుకుని చక్కాబోయాట్ట!'

సర్వజయ ఆ మాటవిని చాలా క్రుంగిపోయింది. ఈమధ్య భర్తని అన్నదారాయ్ ద్వారా ఈ పెళ్ళివిషయమై నీరేన్ తండ్రికి ఉత్తరం రాయించండని కోరింది. నీరేన్ని రెండుసార్లు ఇంటికి భోజనానికి పిలిచింది. కుర్రవాడు ఆమెకి బాగా నచ్చాడు. 'నీరేన్ తండ్రి చాలా డబ్బు ఉన్నవాడు. అతడు మనపిలను చేసుకుంటాడా కొడుక్కి?' అని హరిహరుడు ఆమెకి అనేకవిధాల చెప్పిచూశాడు. కాని సర్వజయమాత్రం ఆశ వదులుకోలేదు. ఈ సంబంధాన్ని ఆశించడం పెద్ద దురాశకాదు, ఈ పెళ్ళి తప్పక జరుగుతుంది - అని ఆమెకి మనస్సులో ఎందుకనో మహాధైర్యంగా ఉంది. హరిహరునికి లోపల నమ్మకం లేకపోయినా భార్య ప్రోద్బలంవల్ల అన్నదారాయ్ని ఉత్తరం రాయమని చాలాసార్లు తొందరపెట్టాడు. కాని ఇప్పుడు ఓ పెద్ద ఆపద వచ్చిపడింది

ఈమధ్య ఒకరోజున దుర్గకి గోకుల్ భార్య కనిపించింది. ఆమె రహస్యంగా దుర్గతో చాలాసంగతులు చెప్పింది. నీరేన్ ఎందుకు వెళ్ళిపోయాడన్న దానికి సంబంధించిన సంగతులే అన్నీ.' అవన్నీ చెపుతూంటే ఆమెకి కళ్లవెంబడి నీళ్లొచ్చాయి.

“మళ్లీ-చివాట్లూ చీపురుదెబ్బలతో వెళ్లిస్తుండే రోజులు — నాకెవరూలేరు దుర్గా! రెండురోజు లెక్కడికైనాపోయి ఉందామన్నా ఇరవులేదు—”

దుర్గకి ఆమెమీద ఎంతో సానుభూతి కలిగింది. దాంతోపాటు పిన్నికి వచ్చిన కళంకం నిరాధారమనటానికి ఉన్న దృష్టాంతాలు, దుఃఖంలో ఓదార్పుటాని కనువైన








జాన్సన్స్ బేబీ పౌడరు

ఉచితము: పిల్లల సంరక్షణను గురించిన ఉచిత యింగ్లీషు పుస్తకము కావాలని వ్రాయండి. దీనిలో తల్లి తండ్రులకు ఉపయోగపడే విషయములు ఎన్నో ఉన్నాయి.

జాన్సన్ & జాన్సన్
పి.ఓ. బాక్సు 1976, డిపార్ట్‌మెంట్ 22 బి
బొంబాయి

B-3024

# ★ పథేర్ పాంచాలి ★

మాటలు-అన్నీ ఆ పిల్లమనస్సులో తిరుగుతున్నాయి. వాటినన్నిటినీ గుదిగ్రుచ్చి చెప్పటం చేతగాక—"సతీశాకురన్ ఎప్పుడూ అంతేలే పిన్నీ! అనుకుంటే అనుకుందిలే. అంతకంటె ఏంచేస్తుంది? ఏడవకు పిన్నీ! ఛా, నువ్వు మంచిదానివి. నేను రోజూ నీదగ్గరకు వస్తూనేవుంటాగా—!" అనిమాత్రం అన్నది.

సర్వజయ ఈ సంగతిని ఆత్రంతో — "పిన్ని ఏమన్నదే దుర్గా! ఆ నీరేన్ సంగతి ఏమయినా చెప్పిందా?" అని అడిగింది.

దుర్గ సిగ్గుపడుతూ—"రేపు రేవుకి వచ్చినప్పుడు నువ్వే అడుగుదూ. నాకు తెలీయదు" అన్నది.

"పిన్ని ఏమని చెప్పింది? మాష్టారు మళ్లీ ఇహ రారని చెప్పిందా?" అని అపూ అడిగాడొకసారి.

"పోరా! నాకేం తెలుసు అదంతా?" అని దుర్గవాణ్ణి గదమాయించింది.

ప్రొద్దుబోకే వేళల, పొడుగునీడలు ప్రాకుతూ ఉండేదారి తమ్ముణ్ణి గురించి మనస్సులో చాలా ఊహాల్ని రేపుతూ ఉంటుంది. ఇలా చాలాసార్లు అనుభవమే. తాను ఎక్కువసేపు ఇంట్లో ఉండకపోయినా, తమ్ముణ్ణి చూడకపోయినా - కాల్పనికాలైన తమ్ముడి కష్టాలెన్నో తలపుకువచ్చి మనస్సు ఎలాగో ఉంటుంది...

తన ఈ పాలబుగ్గల-బంగారుపాపలాంటి తమ్ముడు మాసిపోయిన మట్టలాగూ ఒకటి తొడుక్కొని, గుమ్మంలో ఒక్కడూ ఏ గోలీలో ఏవో ఆడుకుంటూ ఉంటాడు. ఏమన్నా కొనుక్కోటానికి తనని డబ్బులు ఇమ్మని అడుగుతాడు, తాను ఇవ్వలేకపోతుంది-మనస్సుకు మహాకష్టంగా ఉంటుంది-

కొన్నాళ్ళ తర్వాత... భువనముఖర్జీగారింట్లో రాణూ అక్క పెళ్ళయిపోయింది. కాని వచ్చిన చుట్టాలందరూ ఇంకా వెళ్ళిపోలేదు. ఇంటినిండా ఇంకా బిలబిలలాడుతున్నారు పిల్లలు. ఓ చిన్నపిల్లతో దుర్గకి బాగా సావాసం అయింది. ఆ అమ్మాయి పేరు టుని. ఆపిల్ల తండ్రికూడా వచ్చాడు. భార్యని, పిల్లని కొన్నాళ్ళపాటు ఇక్కడ ఉండి రమ్మని, అతడు ఆరోజు మధ్యాహ్నమే, తానుద్యోగం చేస్తున్న ఊరు వెళ్లాడు. ఓ గంటపోయాక ముఖర్జీగారి మరదలు ఆ గదిలో ఏదో పనిచేసుకుంటూ ఉండగా టునితల్లి గొంతు వినిపడింది. ఆవిడ వసారాలోకి వచ్చి, "ఏమిటి వోడీ! ఏమిటి?" అని అడిగింది. టునీవాళ్లమ్మ కంగారుగా-అదుర్దాగా పక్క చుట్టల్లోకి చేతులు పోనిచ్చి, తలగడాలు తీసి, సామానులు అటూ యిటూ పెట్టి వెతుకుతోంది. గూళ్ళలో తొంగి చూస్తోంది. దిళ్ళగలేబులు తీసి చూస్తోంది. "ఇంతకుముందే బంగారు కుంకంబరిణె ఈ పక్కచుట్టప్రక్కన ఇక్కడే పెట్టాను. పిల్లవాడు ఉయ్యాల్లో కక్కటిల్లుతూంటే-వెళ్లాను. ఆ గదిలోంచి ఇక్కడికి తెచ్చాను. మళ్లీ తీసిన జ్ఞాపకంలేదు. ఏమయిపోయిందో కన్పించటంలేదు" అన్నది.

"అదేమిటే అమ్మా! చేతపుచ్చుకుని వెళ్ళలేదూ?" అన్నదావిడ.

"లేదు అమ్మమ్మా! ఇక్కడే పెట్టి వెళ్లాను. బాగా జ్ఞాపకం ఉంది. సరిగ్గా ఇక్కడే-" అందరూ కలిసి నాలుగుమూలలా వెతికారు. బరిణె కన్పడలేదు. మొదట్లో వసారాలో ఇంట్లో పిల్లలే ఉన్నారని తర్వాత అన్నాలు తినటానికి రండని కబురు వచ్చేసరికి అందరూ లోపలికి వెళ్లారని, అప్పుడు బయటవాళ్ళలో ఉన్నది దుర్గ ఒక్కతేనని ముఖర్జీగారి మరదలు భోగట్టా తీసి తెలుసుకుంది. ఆవిడ చిన్నకూతురు రహస్యంగా— "మేము అన్నానికి వెళ్లేప్పుడు దుర్గాదీ ఈ దొడ్డిదారిని ఎక్కడికో వెళ్లి, మళ్లీ అప్పుడే వచ్చింది-" అని చెప్పింది.

ఆవిడ ముందు మెల్లిగా ఏం గుసగుసలాడిందో, తర్వాత గట్టిగా-"బరిణ ఇచ్చెసెయ్ దుర్గా! ఎక్కడ పెట్టావో చెప్పు. నేను చెపుతున్నా, బయటికి తియ్" అని నిగ్గతీసింది దుర్గను.

దుర్గ ముఖం చిన్నబోయింది. ఆవిడ వైఖరి, ఆ మాట తీరు చూసేసరికి, ఆ పిల్లకి నాలిక పిడచకట్టుకుపోయింది. అస్పష్టంగా ఏమి అన్నదో సరిగ్గా తెలియలేదు.

టుని తల్లి ఇంతవరకు ఏమీ మాట్లాడలేదు. ఓ మర్యాదస్తుల ఇంటి బిడ్డమీద అందరూ ఏకమై దొంగతనం కట్టేసరికి ఆమె కొంచెం తెల్లబోయింది. అదీకాక ముఖ్యంగా దుర్గను కొన్నాళ్ళనుంచీ తానిక్కడ చూస్తోంది. చూపులకి చక్కనిదని దుర్గంటే ఆమెకి ఇష్టం ఏర్పడింది. అలాంటి పిల్ల దొంగతనం చేస్తుందంటే - సంభవమా? "ఆ పిల్ల తీయలేదనుకుంటాను ఆ పిల్ల ఎందుకు—" అన్నది.

"నీ కెందుకు నువ్వు మెదలకుండా ఊరుకోరాదూ? అది తీసిందో, లేదో నీకేం తెలుసు, నాకు తెలుసుగాని—" అన్నదావిడ.

"నువ్వు తీస్తే బయటపెట్టు. లేదా ఎక్కడుందో చెప్పు. గండం గడచిపోతుంది. ఇచ్చెసెయ్ అమ్మాయ్, నువ్వు మంచిదానివి. ఎందుకు అనవసరంగా—" అన్నారొకరు.

దుర్గ అదోకలా అయిపోయింది. ఆ పిల్లకి కాళ్లు గజగజ వణుకుతున్నాయి. గోడకు ఆనుకుని నుంచుని - "నేను యెరగను అమ్మమ్మా! నేను—" అన్నది.

"నువ్వు లేదంటేమాత్రం నేనువింటానా? కచ్చితంగా నువ్వే తీశావు. నీ ముఖంచూసే కనిపెట్టాను నేను. మంచిగా చెపుతున్నాను. ఎక్కడపెట్టావో ఇచ్చెసెయ్. వస్తువు ఇచ్చేస్తే నేనేమీ అనను. మా వస్తువు దొరికితే చాలు—"

"మర్యాదస్తుల ఇంటిబిడ్డలు దొంగతనం చెయ్యటం ఎక్కడా వినలేదమ్మా. ఈ వీథి నేనా వీళ్ల యిల్లు?" అన్నది ఇందాకటి ఆవిడ.

"నువ్వు మంచిగా చెపితేవినే మనిషివి కావు. నీ సంగతేమిటో కనుక్కుంటాను ఉండు. నువ్వు మాయింట్లో వస్తువులు పొట్టను పెట్టుకుంటున్నావు. ఇదీ అంతే చేశావు. ఇవాళ నిన్ను—" అన్నది ఆయన మరదలు.

ఇహాతర్వాత ఆవిడ దుర్గను చెయ్యి పట్టుకుని బరబరలాగి, వసారామధ్యలోకి తీసుకువచ్చి, "దుర్గా! ఇప్పటికైనా చెప్పు ఎక్కడ పెట్టావో! చెప్పవా నువ్వు? నీకు తెలియనే తెలియదా! పాపం, పసిపిల్లవునువ్వు నీకేమీ తెలియదు. చప్పున చెప్పు. లేకపోతే మూతిపళ్ళన్నీ రాలకొడతా నిప్పుడు, ఏమనుకొన్నావో! చెప్పు చప్పున. నేను చెపుతున్నా, ఇప్పటికైనా చెప్పు—" అన్నది.

టునితల్లి ఆమె చెయ్యి పట్టుకోటానికి ముందుకు వస్తోంది. ఒకావిడ "ఆగు, చూడు ఆమె సరిఅయిన పనిచేస్తోంది. దొంగకి దెబ్బే మందు. ఇచ్చేశావంటే అంతా సద్దుమణిగిపోతుంది. ఎందుకు వృథాగా-" అన్నది.


సపట్
లోషన్
లేక
మలాము
తామర, గజ్జి మరియు
దురదలకు
ఏజెంట్లు
ది ట్రేడ్ ప్రమోటింగ్ కార్పొరేషన్.
విజయవాడ - 2

దుర్గకి తలంతా దిమ్మెక్కినట్లయింది. విస్మయాయురాలిలా నాలుగువైపులా చూస్తూ, వాడి అరిపోయిన నాలికను ఎలాగో తడి చేసుకుని, "నే నేమీ ఎరుగను అమ్మమ్మా! వాళ్ళందరూ వెళ్ళిపోగానే నేను కూడా—" అంటూ భయంతో ఇలకరుచుకుపోయి, ఆవిడ ముఖంకేసి అలాగే చూస్తూ ఇంకా వెనక్కి జరిగి గోడకి అంటుకుపోయింది.

తర్వాత అందరూ కలిసి దుర్గకి ఇంకాసేపు నచ్చచెప్పి చూశారు. ఎన్ని చెప్పినా ఆ పిల్ల ఒకటేమాట—'నేను ఎరుగను' అని.

"గజదొంగ—" అన్నారొకరు.

"తోటలో మామిడికాయల్ని క్రిందరాలనియ్యదుగా అమ్మమ్మా!—" అన్నది 'టేంపి.'

ఆ చివరిమాట ముఖర్జీగారిమరదలికి పుండు కెలికినట్లయింది. ఆమె చటుక్కున ఇవాకర్కశంగా. "పాపిష్టిదానా! పుంఛాకోర్, ఇయ్యావూ నువ్వు అది? చూస్తాను ఇస్తావో లేదో—" అంటూ ఆమె దుర్గమీద విరుచుపడి, ఆ పిల్ల తలను గోడకేసి కొట్టటం మొదలెట్టింది. "చెప్పూ, ఎక్కడ పెట్టావో! చప్పున చెప్పెయ్. చెప్పు. ఊఁ, త్వరగా; చెప్పు—"

టునీ తల్లి గబగబా పరుగెత్తుకొచ్చి ఆవిడ చెయ్యి పట్టుకుని, "ఏమిటిది? ఏమిటి అక్కయ్యా మీరు చేస్తున్నది! పోతే పోయింది బరిణె. ఎందుకలా కొడతారు? విడిచిపెట్టండి. చాలు ఊరుకోండి. ఛా, విడిచిపెట్టండి" అన్నది. ఆ దెబ్బలు చూసి టుని ఏడవటం మొదలెట్టింది.

"అరె; రక్తం వస్తోందల్లే ఉందే!" అన్నది ఇందాకటి ఆవిడ.

దుర్గకి ముక్కులోంచి రక్తం వస్తోంది. అది ఎవరూ చూడలేదు. గుండెలమీద చొక్కామీద రక్తపుచుక్కలు పడ్డాయి.

"చప్పున వెళ్ళి కాసిని నీళ్ళు తీసుకురా టేంపీ! వసారాలో చేదలో ఉన్నాయి. చూడు—" అన్నది టునీ తల్లి.

ఈగందరగోళం అంతా విని పొరుగింటి కమ్మరి పెళ్లాం వాళ్లూ ఏమిటో చూసిపోదామని వచ్చారు. రాణూతల్లి ఇప్పటివరకూ ఇంట్లో లేదు. మధ్యాహ్నం భోజనాలవీ కాగానే పొరుగింటికి వెళ్ళి కబుర్లు చెపుతూ కూర్చున్నది-ఆమె కూడా వచ్చింది.

తలకి తగిలిన దెబ్బలకి గాయమై, జివ్వున ప్రాణం లాగుతూంటే, దిక్కుతోచక ఆ జనంకేసి అలాగే ఏమిటో చూస్తూ ఊరుకుంది దుర్గ.

నీళ్లు రాగానే రాణూతల్లి దుర్గ ముఖం మీద, కళ్ళమీద నీళ్ళు చల్లి పట్టుకుని కూచుంది. తల దిమ్మెత్తిపోయింది. ఒళ్ళు తెలియని స్థితిలో అలాగే కూర్చుంది దుర్గ.

"ఇలా కొడతారమ్మా చిన్నక్కా అసలే ఒంట్లో ఊపిరిలేని పిల్లకదా—"

"దాని సంగతి మీరింకా తెలుసుకోలేదు. దొంగకి దెబ్బ తప్ప మరొక మందు లేదనుకో. నేచెవుతున్నాగా, దెబ్బలు అప్పుడే ఏమయ్యాయి? ఆవస్తువు దొరకనిదే దీన్ని విడిచిపెడతాననుకున్నావా? హరిహరరాయ్ నన్నుం తలతీసి మొలేస్తాడా?" అన్నదావిడ.

"చాల్లే ఇప్పుడు కాస్త సముదాయించుకోనియ్. నువ్వు చేసిన పని—" అన్నది రాణూ తల్లి.

"అయ్యో ఇంత జరుగుతుందని తెలిస్తే అసలు బరిణె సంగతి ఎత్తేదాన్ని కాదు. నాకు బరిణె వద్దు, ఏం వద్దు కాని, ఆపిల్లని విడిచిపెట్టు చిన్నక్కా!" అన్నది టునీతల్లి.

ఆవిడ అంత తేలిగ్గా విడిచిపెట్టేదో లేదో చెప్పలేం. కాని అక్కడున్న వాళ్లంతా ఆమె మాటకు విరుద్ధంగా మాట్లాడసాగారు. అంచేత ఆవిడ ప్రతివాదినిని వదిలిపెట్టక తప్పలేదు.

రాణూతల్లి ఆపిల్లను పట్టుకుని తీసుకువచ్చి, అటువైపు తలుపు తెరచి బయటికి పంపిస్తూ "ఇంట్లోనుంచి ఏ పాడుగడియలో బయలుదేరావో ఇవాళ! సరే, అయిందేమో అయింది. మెల్లిగా వెళ్లు అమ్మా! టేంపే గుమ్మంతలుపు బార్లగా తీయవే—" అన్నది.

దుర్గ ఒళ్లు తెలియనిస్థితిలోనే 'అగుమ్మం' దాటి వెళ్లింది. అక్కడున్న పిల్లలంతా ఆ పిల్లకేసే చూస్తూ నుంచున్నారు.

"ఏమయినా ఒప్పుకోలేదు చూశారా! ఎంత గట్టిదో; కళ్ల వెంబడి ఒక్క నీటిచుక్కయినా రాలలేదు కదా!" అన్నది ఒకావిడ.

"నీళ్లు ఎలా వస్తాయి! భయంతో కొయ్యబారిపోయింది; కళ్లలో ఇంకా నీళ్లలా ఉంటాయి! అంతలా కొడతారటమ్మా అక్కా" అన్నది రాణూ తల్లి.

## 22

ఊరివారంతా కలసి నిర్వర్తించే చైత్ర సంక్రాంతి ఉత్సవం దగ్గిరకు వచ్చింది. వైద్యనాథ ముజుందార్ చందాల జాబితా చేతపుచ్చుకుని, ఇంటింటికీ తిరిగి చందాలు వసూలు చేస్తున్నాడు. "కాదు బాబాయ్, ఈసారి రూపాయిచందా నాకు రుద్దటం న్యాయంకాదు. రూపాయి ఇచ్చుకోగలిగిన స్థితేనా నాది?" అన్నాడు హరిహరుడు. "అది కాదోయ్, ఈసారి నీలమణి హాజ్రా జటు వస్తున్నది. అలాంటి బృందాన్ని ఈ వైపుల యెవరూ కళ్ళతో చూసికూడా యెరుగరు. ఏమనుకున్నావో! 'పాల్ పాడా' వాళ్లంతా కలసి ఈ సారి మహేశ్ సేక్రా భజనబృందాన్ని తెప్పిస్తూంటే—వాళ్లతో పోటీకి మనం ఈసారి—"

ఈ పోటీ ఫలితాలమీదనే ఏమిటో మహా ఈ నిశ్చిందిపురం గ్రామస్థుల చావుబ్రతుకులు ఆధారపడిఉన్నాయన్న ధోరణిలో మాట్లాడాడు ముజుందార్.

అపూ వెదురుచువ్వ ఒకటి త్రిప్పుతుంటూ వచ్చి, "మంచి యేపుగా ఉన్నది నాన్నా! నీకు మంచి కలం అవుతుంది. ఆ దొరువు ప్రక్కన వెదురుపొదలోఉంటే తీసుకుని వచ్చా," అంటూ నవ్వుతూ దాన్ని పైకెత్తి చూపిస్తూ "నీకు కలంఅవదా నాన్నా! ఎంత యేపుగా ఉందో! కదూ?" అన్నాడు.

చైత్రసంక్రాంతి ఇంకనాల్గో లేదు. శైవసన్యాసులు ఆడుతూ పాడుతూ ఇంటింటికీ బయలుదేరారు. దుర్గ, అపూ నిద్రాహారాలు మానుకుని ఆ సన్యాసుల వెంటపడి వీథివీథీ తిరుగుతున్నారు. ఇతరులందరి ఇళ్లలో వాళ్లకి పాతగుడ్డలు, బియ్యం, డబ్బులూ ఇస్తూంటారు. వాళ్లు గుప్పెడు బియ్యం పెట్టటంతప్ప ఇంకేమీ ఇవ్వలేరు. అందుచేత ఆ సన్యాసులు తమ యింటికి రారు. పది పన్నెండు రోజులు ఈ సన్యాసు



కృష్ణాలేబరేటరీ, బెజవాడ

# ★ పథేర్ పాంచాలి ★

తీలా తిరగటం అయాక ఆ సంక్రాంతికి నీలపూజ జరిపే రోజు వచ్చింది.

నీలపూజనాటిసాయంత్రం సన్యాసులంతా ఓ చిన్న ఖర్జూరచెట్టు చుట్టూ చేరి చెక్కభజన చేస్తారు. దుర్గ ముందుగానే వచ్చి, "ఏటాచేసే చెట్టుదగ్గిర కాదు యీ యేడు. వీటివొడ్డున యింకో చెట్టును సన్యాసులు ముందుగానే నిర్ణయించుకున్నారు" అని చెప్పింది. ఆ వీధిలో పిల్లలనందర్నీ పిలుచుకుని దుర్గ అపూ జట్టుగా అక్కడికి వెళ్ళి మూగారు. అక్కడ ఆ చెక్కభజన అయిపోగానే అందరూ సంక్రాంతి ఉత్సవంచోటికి ఒకసారి చూసి రావటానికి బయలుదేరారు. నీలపూజ మంటపంచుట్టూ ఖర్జూర మట్టలు కట్టారు. ఉత్సవం జరిగే స్థలంలో మొక్కలూ మోళ్ళూ అన్నీ కొట్టేసి అదంతా చదునుచేశారు. అక్కడ భువన ముఖర్జీగారింట్లో పిల్లలు రాణీ, పూంటే, టునూ కలిశారు. దుర్గలాగా యెక్కడికి పడితే అక్కడికి ఇష్టంవచ్చినట్లు తిరగకూడదని ఈ పిల్లలని కట్టడిచేశారు. యెలాగో ప్రతిమాలి, మారాంచేసి అతికష్టంమీద ఈ ఉత్సవంచోటుకుమాత్రం రాగలిగారు.

"ఈ రాత్రి సన్యాసులు శ్మశానంలో జాగరణ చేస్తారుకదూ!" అన్నది టునూ.

"ఆఁ. ఆమాత్రం తెలియదనుకున్నావా? ఒక మనిషి శవం అవుతాడు. ఆ శవాన్ని కట్టి శ్మశానంలోని ఆ జమ్మిచెట్టుక్రిందికి తీసుకువెళతారు. ఆ శవాన్ని మళ్ళీ బ్రతికిస్తారు. తర్వాత శవంపునక తీసుకుని పదాలు పాడుకుంటూ వస్తారు. వాటికన్నిటికీ మంత్రాలున్నాయి-" అన్నది రాణీ.

"నాకూ తెలుసు ఆ పదాలు ... అని నవ్వుతూ "ఈసారి గోష్ఠబిహారీ బొమ్మలెంత బాగున్నా యనుకున్నారు? దాశురథ్ ఇంట్లో చూసివచ్చాను. చూడలా రాణూ!" అన్నది దుర్గ.

"నిజమైన శవాలపుర్రెలేనా రాణూదీ?" అని అడిగింది పూంటే.

"లేకపోతే ఏమిటనుకున్నావ్? రాత్రి ప్రొద్దుపోయాక వచ్చావంటే చూడొచ్చు. పదండ్రా. మనం ఇహ ఇళ్ళకు పోదాం. యీ రాత్రి మంచిదికాదు. రారా, అపూ; రా, దుర్గాదీ!" అన్నది రాణీ.

"ఎందుకు మంచిదికాదు రాణూదీ! ఈ రాత్రి ఏంజరుగుతుంది?" అని అడిగాడు అపూ.

"అదంతా చెప్పకూడదు. నువ్వు రా ఇంటికి," అన్నది రాణీ. అపూ వెళ్ళలేదు. దుర్గమాత్రం వాళ్ళజట్టుతో కలిసి వెళ్ళింది. తర్వాత హఠాత్తుగా మబ్బుపట్టుకువచ్చింది.

మబ్బుపట్టటంతో సందెచీకటి కారుచీకటి అయింది. అపూ ఇంటికి తిరిగి వస్తున్నాడు. తోడు యెవ్వరూ లేరు. శ్మశానం, శవాలు, పుర్రెల కథలు వినటంతో సాయంకాలంనించీ వాడి మనస్సుకి యేమిటో భయభయంగా ఉంది. మలుపులో వెదురుతోపు దగ్గిరకు వచ్చేసరికి దేనిదో పాడునాపన కొడుతున్నట్లనిపించింది. వాడు గబగబా ఇంకొంచెం ముందుకు వెళ్ళేసరికి 'నేడా' వాళ్ళ అమ్మమ్మ ఎదురుపడింది. ఆవిడ 'ఆ ఉత్సవంచోటికి నైవేద్యం, పూజాద్రవ్యాలు తీసుకువెడుతోంది. అపూ చీకట్లో మొదట గుర్తుపట్టలేకపోయాడు. తర్వాత గుర్తుపట్టాక "ఆ వస్తున్నది దేనివాసన అమ్మమ్మా?" అని అడిగాడు.

"ఇవాళ వాళ్ళంతా బయలుదేరారుగా! వాళ్ళవాసనే—అంతకంటె ఏముంటుంది?" అన్నది ముసలమ్మ.

"వాళ్ళెవరు?"

"ఎవరా ఇంకా? శివుని అనుచరులు. సందెవేళ వాళ్ళ పేరు యెత్తకూడదు. హరేరామ్, హరేరామ్."

అపూ ఒళ్ళు గగుర్పొడిచింది. చుట్టూ కారుచీకట్లు, పైన నల్లటి మబ్బులు. వెదురుతోపు, శ్మశానపు కమురుకంపు, శివుని అనుచరులు, భూతప్రేతాలు—ఆ పసివాడి మనస్సు భయం, ఆశ్చర్యం—తెలియని అనుభూతితో ఆవృతమైపోయింది. వాడు భయపడుతూ "నేను ఇంటికెలా వెళ్ళటం అమ్మమ్మా?" అని అడిగాడు.

"అలాంటప్పుడు ఇవాళ రాత్రి ఇంతసేపటిదాకా ఎందుకు ఉన్నావ్? రా, నాతో కూడా రా, ఈ పళ్ళెమూ ఇదీ ఆ పూజ చేసేచోట ఇచ్చేసి తర్వాత తీసుకువెడతాను. ఇంకా నయం-" అన్నది శేకతేస్తూ.

రథప్రదేశంలో గడ్డి అంతా చెక్కి, పందిరివేసి మంచెకట్టారు. వీధిభాగోతులు వస్తారు వస్తారు అంటున్నారు కాని, ఇంకా ఇంతవరకు రాలేదు, సందె పడిపోయింది. రేపు ప్రొద్దున రైల్లో వస్తారట అన్నారు కొందరు. ప్రొద్దున అంతా గడిచిపోగానే సాయంత్రం వస్తారని ఆశపడుతున్నారు. అపూ అన్నం నీళ్ళు మానుకునే స్థితిలో పడ్డాడు. రాత్రంతా వాడికి నిద్రపట్టలేదు. కట్టతెగిన ప్రవాహంలా వాడి ఉత్సాహం సంతోషం పట్టశక్యం కావటంలేదు. పక్కమీద ఊరికే అటూ యిటూ దొర్లటమే. భాగోతం వేస్తారు. భాగోతం వేస్తారు! అని ఒకటే రంధి!

'ఈడొస్తున్న పిల్ల, [illegible] తిరతిరిగే అక్కడికి వెళ్ళకూడదు' అని తల్లి ఎంత అరిచి చెపితే ఏంలాభం! దుర్గ రహస్యంగా వెళ్ళి చూసివచ్చి, రాజలక్ష్మితో ఆ భాగోతం వేసేచోటు ఎంచక్కగా ఏర్పాటు చేసిందీ, పందిట్లో వ్రేలాడకట్టిన రంగుకాగితాల తోరణాలు ఎంచక్కగా ఉన్నదీ అన్నీ పనిగా చెపుతూ కూర్చుంది. రోజూ ప్రొద్దునా, సాయంత్రం గోలీలు ఆడుకునే ఆ మామూలు చోటులో ఇవాళో రేపో నీలమణి హాజ్రా వీధిభాగోతం పడటమనేది సంభవమేనా! అని అపూ మనస్సుకి అనిపించసాగింది. ఏమిటో వాడికా మాటమీద నమ్మకం కలగకుండా ఉంది.

ఈ సాయంత్రమే భాగోతులు వస్తున్నారని హఠాత్తుగా తెలిసింది. వాడి ఒంట్లో రక్తం పరుగులెత్తినట్లయింది.

కుమార్‌పాడామలుపులో మధ్యాహ్నం నుంచీ కుర్రాళ్ళందరితో కలిసి నుంచోగా, నుంచోగా చివరికి అంత దూరాన ఓ ఎద్దుబండి కన్పించింది. దుస్తుల పెట్టెలతో ఉన్న బళ్ళు ఒకటి, రెండు, మూడు, నాలుగు అయిదు, పటూ వ్రేలితో చూపిస్తూ ఒక్కొక్కటే లెక్కపెడుతూ, "అపూదా! మనం వీటివెనకాలే బసల్లోకి వెళ్ళి చూసివద్దాం, వస్తావా?" అన్నాడు. ఆ బళ్ళ వెనక వేషాలవాళ్ళు వస్తున్నారు. పటూ ఒక గడ్డం ఉన్న మనిషిని చూపిస్తూ "ఈయన రాజువేషం వేస్తాడల్లే ఉంది. కాదూ అపూదా?" అన్నాడు.

వాతావరణం అంతా ఒక్కసారిగా మారిపోయింది. అపూ మంచి ఉత్సాహంతో ఇంటికివచ్చి చూసేసరికి వాళ్ళనాన్న వసారాలో కూర్చుని ఏమిటో రాసుకుంటూ గొణుక్కుంటున్నాడు. ఆయన వైఖరినిబట్టి 'వీధిభాగోతులు వస్తున్నారని నాన్నకి కూడా తెలిసింది. అందుకనే ఇంత హుషారుగా ఉన్నా'డనుకున్నాడు. ఉత్సాహంతో చేతులు త్రిప్పుతూ "అయిదుబళ్ళ దుస్తుల సామానులు వచ్చాయి నాన్నా! ఎలాంటి జట్టో' - అన్నాడు.

హరిహరుడు ఏదో రాసుకుంటూ కూర్చున్నాడు, తలయెత్తి ఆశ్చర్యపోతూ "ఎవరి దుస్తులురా?" అని అడిగాడు. అపూ విస్తుపోయాడు. 'ఇంత మహత్తర సంఘటన నాన్నకి తెలియదన్నమాట! నాన్నస్థితి నిజంగా జాలిపడవలసిందే,' అనుకున్నాడు.

ప్రొద్దున్నే లేచి అపూ చదువుకుంటూ కూర్చోవాలి. కాసేపయాక వాడు ఏడుపు మొహంపెట్టి, "నేను రచ్చబండదగ్గిరికి వెడతాను నాన్నా. అందరూ వెడుతూంటే నేనొక్కణ్ణే ఇక్కడ చదువుకుంటూ కూర్చోనా! భాగోతం మొదలెట్టేస్తే!" అన్నాడు.

"చదువు, చదువు, కూర్చుని చదువు,

మొదలు పెడితే మద్దెల చప్పుడు వినబడుతుందిలే. అప్పుడు వెళ్లొచ్చు, ఇప్పటినుంచీ ఎందుకు?" అన్నాడు తండ్రి. కుర్రవాడు పెద్దవాడవుతున్నాడు. తాను ఇటీవల తరచు పొరుగూళ్లు తిరగవలసివస్తోంది. ఇంట్లో ఉన్న నాలుగురోజులూ పిల్లవాడ్ని కళ్ల ముందునుంచి కదలనీయటానికి మనస్కరించటంలేదు. అభిమానంతో కోపంతో అప్పూ కళ్లల్లోనీళ్లు గిర్రున తిరిగాయి. వాడు ఏడుపు గొంతుపెట్టి ఎక్కాల పుస్తకంతీసి చదవటం మొదలెట్టాడు.

భాగోతం మొదలెట్టటానికి చాలా వ్యవధి ఉందని తెలిసింది. అప్పుడిక అప్పూ తల్లి దగ్గిరకువెళ్ళి తండ్రి తన విషయంలో చేస్తున్న అత్యాచారాన్ని వర్ణించిచెప్పాడు. సర్వజయ వచ్చి, "వాణ్ణి విడిచిపెట్టరాదు టండీ! ఏడాదికొక్క రోజు-మీరు ఏడాదిలో తొమ్మిది నెలలు ఇంటిపట్టునే ఉండరారు. ఈ ఒక్క రోజు చదువుకే వాడేం తర్కాలంకారపండితు డయిపోతాడాయేం?" అన్నది.

వాడికి సెలవు దొరికింది. మధ్యాహ్నమంతా రచ్చబండ దగ్గిరే గడిపాడు. రాత్రి భాగోతానికిముందు, పెందరాళే ఇంటికి అన్నానికి వచ్చాడు. తండ్రి వసారాలో కూర్చుని రాసుకుంటున్నాడు. మామూలు రోజునయితే ఈ వేళప్పుడు అప్పూ తండ్రి దగ్గిర పుస్తకం తీసుకుని కూర్చోవాలి. కుర్రవాడి కెక్కడ తిక్క రేగుతుందోనన్న భయంతో, వాణ్ణి హుషారుగా ఉంచటానికి రకరకాల తమాషాలు చేసేవాడు తండ్రి. "చప్పున కళ్లుమూసి తెరిచేలోపున చప్పున పలకమీదరాయి చూద్దాం..." అప్పూ తండ్రి మాటలకు సంతోషిస్తూ గబగబారాసి తీసుకువచ్చి, "ఇది అయిపోయిందిగా, ఇహ నేను వెడతాను నాన్నా!" అనేవాడు. "వెడుదువుగాని, ఇప్పుడే వెడుదువుగాని... ఏదీ చప్పున రాయిమరి" అని ఇంకొక చక్కనికథ చెప్పేవాడు తండ్రి. అప్పూ మళ్ళీ సంతోషంతో మురిసిపోయేవాడు.

కాని ఇవాళ బయటినుంచి ఏదో శక్తి తనని తండ్రిదగ్గిర్నుంచి లాక్కుని వెడుతున్నట్లనిపించింది అప్పూ మనస్సుకు. తండ్రి నిర్జనంగా ఉన్న వసారాలో వ్రాసుకుంటూ కూర్చున్నాడు. తనని కూర్చోమనే దమ్ము లేదాయనకు, ఒకవేళ 'కూర్చుని చదువుకోరా' అని అంటే ఇంకేముంది. నాలుగు ప్రక్కల్నుంచీ పెద్ద గందరగోళం బయలుదేరుతుంది. కాదు, కాదు, అలా వీల్లేదు.

భాగోతం మొదలెట్టేస్తాంటే!' అంటారు అందరూ. ఏ బలీయమైన ఉల్లాసపు శక్తో తన తండ్రిని దుర్బలుణ్ణి, నిస్సహాయుణ్ణి చేసేసి ఉంటుంది. తండ్రి విషయమై అప్పూ మనస్సు అదోలా అయిపోయింది.

"అప్పూ పేరంటానికి వస్తానని నువ్వు చెప్పు అమ్మతో" అన్నది దుర్గ. "అక్క నాతో కూడా వస్తేయేం అమ్మా? వెదురువాసా లక్కంకట్టి ఆడవాళ్ళకి ఏర్పాటుచేసిన చోట కూర్చుంటుంది" అన్నాడు అప్పూ. "ఇప్పుడు వొద్దులేరా. నేనూ వాళ్లయింట్లో ఆడవాళ్లు మేమంతా వస్తాం తర్వాత. అది కూడా మాతో కలసి వస్తుందిలే" అన్నది వాళ్ళమ్మ.

భాగోతం జరిగే చోటికి వెళ్ళబోతూంటేగా దుర్గ అప్పూని వెనక్కి పిలిచింది— "అప్పూ ఇలా రారా!" అని. వాడు దగ్గరకు రాగానే నవ్వుముఖం పెట్టి — "చెయ్యి చాచు" అన్నది. చెయ్యి చాచగానే ఓ అర్ధణా వాడి చేతిలో పెట్టి, గుప్పిట మూయించి పట్టుకుని, "చీనీపళ్లు అయినా, పంచదార జీడీలయినా కొనుక్కుని తిను" అని చెప్పింది. అంతకు ఓ వారం రోజులకు క్రితం అప్పూ పిల్లిలాగా మెల్లిగా వచ్చి "అక్కా నీ బొమ్మల పెట్టెలో డబ్బులేమయినా ఉన్నాయా? నాకో కానీ ఇద్దూ" అని అడిగాడు. "ఏం చేస్తావురా డబ్బులు? ఎందుకు?" అని అడిగింది దుర్గ. అప్పూ అక్క ముఖంకేసి చూసి నవ్వుతూ "చీనీ పళ్లు కొనుక్కుని తింటాను" అని కొంచెం సిగ్గుపడుతూ మళ్ళీ నవ్వాడు. "వైష్ణవుల తోటలో వాళ్ళు మంచె కట్టారు అక్కా! ఎన్ని చీనీపళ్లు అనుకున్నావ్? రెండు గంపలు...కానీకి ఆరుట. ఇంతంత పెద్దపెద్ద పళ్ళు ఎర్రగా సిందూరంలా ఉన్నాయి. సతూ కొనుక్కున్నాడు, సాధన్ కొనుక్కున్నాడు" అని ఒక్క నిమిషం ఆగి, "ఉన్నాయా అక్కా?" అని అడిగాడు. ఆ రోజున దుర్గ బొమ్మల పెట్టెలో ఏగానీ కూడా లేదు. ఏమీ ఇవ్వలేకపోయింది. అప్పూ ముఖం చిన్నబుచ్చుకుని వెళ్ళిపోవటం చూసేసరికి దుర్గ మనస్సుకి చాలా కష్టం వేసింది ఆ రోజున. అంచేత సాయంత్రం ఈ ఉత్సవం పేరుతో తండ్రిని ఓ అర్ధణా అడిగి తీసుకుంది. బంగారపుబొమ్మలాంటి తమ్ముడు, వాడి పంతం తీర్చలేకపోతే దుర్గ [illegible] హృదయానికి ఎలాగో ఉంటుంది.

అప్పూ వెళ్ళిపోయాక వాళ్ల అమ్మ ఏటి నుంచి వచ్చి "ఒక్క పనిచేసి పెటతే అమ్మాయీ! రాయూ వాళ్ల తోటలోకి వెళ్ళి రెండు కరివేపాకు రెబ్బలు తెచ్చిపెట్టవే, తమ్ముడికి ఒంట్లో బావుండలేదు, కొత్త కారప్పొడి కొడతాను" అన్నది.

తల్లి మాట అనడమే తరువాయిగా దుర్గ ఒక్క పరుగుమీద రాయూవాళ్ల తోటలోకి పరుగెత్తింది. తోటలో మనిషి ఎత్తున పెరిగిన చెట్లలో కరివేపాకు మొక్కలు వెతుక్కుంటూ, చిన్నప్పుడు అత్తయ్యదగ్గిర నేర్చుకున్న పాటలు పాడుకో సాగింది.

(ఇంకా వుంది)

డా॥ గంభీర్‌వారి
హీరా కోల్డ్ లోషన్
అన్ని ఔషధాలయము అని పెద్ద అంగడియల దొరకును
కన్ను అన్ని వ్యాధులకు
PRICE 0-8-0
THE GAMBHIR CHEMICAL & PHARMACEUTICAL WORKS Ltd.
BANGALORE-3 ... BOMBAY-24
విజయవాడ స్టాకిస్టులు:
ఎసేక్ కార్పొరేషన్ మెయిన్ బజారు.
విజయనగరం స్టాకిస్టులు:
మెసర్సు: మహమ్మద్ యాసిన్ బ్రదర్సు జనరల్ మర్చంట్సు.

రవి టాయిలెట్స్- అందముకు, వర్చస్సుకు
RAVI GLYCERINE SOAP
రవి గ్లిసరిన్ సోప్:- అన్ని కాలములలో, ముఖ్యముగా వేసవి కాలములలో వాడదగినది. శరీరమును మృదువుగను, కాంతిగను ఉంచును.
రవివెజిటబుల్ హేరాయిల్: శిరోజములను విస్తారముగా పెంపొందించును. దాని చక్కని సున్నితమైన సువాసన అందరికీ ఆనందము కలుగచేయును.
రవి స్నో:- ముఖవర్చస్సును కాపాడి, విలాసమును పెంపొందించును.
హోల్ ఏజెంట్లు: ది న్యూ స్టార్ & కో.,
10, వైద్యనాథ మొదలి వీధి, తండియార్పేట, మద్రాసు-21.

చాగంటి తులసి

ఇంకా నిన్నా మొన్నలా ఉంది. నేనూ రామం కాకినాడ కాలేజీలో చదువుకోడం. కాలేజీ దగ్గర్లోనే ఉండేది నా లాడ్జి. రామం పగలూ, రాత్రీ నా లాడ్జిలోనే ఉండేవాడు. ఇంటికి వెళ్లడం వాడికి ఇష్టం ఉండేదికాదు. వాణ్ణిచూస్తే ఎంతో జాలీ, అభిమానం పుట్టుకొచ్చేవి. వాడిసోది అంతా నా దగ్గిర వెళ్ళగక్కేవాడు. నాతో చెప్పుకుంటేనేకాని వాడికి మనశ్శాంతి ఉండేదికాదు. దాపరికం అంటూ ఏమీ లేదు. వాళ్లింట్లో రహస్యాలన్నీ నాకు బట్టబయలే. "నీకొక్కటి చెప్తున్నాను. ఇంకెవరితోటీ అనకు. పరువు కాస్త పోతుంది," అని కూడా చెప్పుకునేవాడు, వాడి గౌరవం ఎప్పుడూ కాపాడుతూనే వచ్చేను.

ఆ రోజుల్లో నాకలా కనపడలేదు కాని రామానికి నేను చేసిన ఉపకారం ఇప్పుడాలోచిస్తే చిన్నది కాదని ఎవరైనా అంటారు. వాడి జీవితాన్ని అట్నుంచిటు తిప్పేసిన విషయం అప్పుడు నే ననుకోనే లేదు. ఎప్పుడూ అలోలక్ష్మణా అని ఏడుస్తూ ఏదో నరకంలో పడిఉండేవాడు.

ఇప్పుడు మా ఊళ్ళో ఇంజనీరుగా వచ్చిన వాడు మా రామం కొడుకదా అని అనుమానం వచ్చింది. పేరు అదే. మా రామమూ యింజనీరే. రామమే అయితే మా యింటికి రాకుండా ఉంటాడా?

రోడ్డుమీద కారులో వెళ్తూ రామం కనపడ్డాడు. ఊళ్ళో కొచ్చిన యింజనీరు నా చిన్ననాటి స్నేహితుడే. ఏదో ఆనాడు నానా ఇబ్బందులుపడ్డా ఈనాడు హాయిగా పెద్దఉద్యోగస్థుడయ్యేడు. బళ్లు ఓడలవుతాయి. ఓడలు బళ్ళవుతాయి. రామానికి హీనస్థితి విద్యార్థిదశతో వదిలిపోయింది. నేను విద్యార్థిదశలో ఓ వెలుగు వెలిగేను. ఇప్పుడూ స్థితికేమీ లోపంలేదు. కోపరేటివ్ బ్యాంకులో గుమాస్తాగిరీ చేస్తున్నాను. ఇల్లూ, వాకిలీ ఉన్న ఊళ్ళోనే ఉద్యోగం. నాలుగు రాళ్లున్నాయి. నాల్గు రాళ్లు తెస్తున్నాను. నా విచారమల్లా నాగా పెద్దవాణ్ణవలేదనే.

రామంమీద మొట్టమొదటసారి జాలికలగడం నాకు బాగా గుర్తు. ఆ వేళ చాకలాడు బట్టలన్నీ తెచ్చేడు. వాటిలోంచి ఓ నీలి చారల షర్టుపైకి తీసి, "ఇది ఆ వెధవకి పారేస్తే తీరిపోతుంది" అన్నాను.

"ఏ వెధవకురోయ్?" అడిగేడు రామం.

"మనకాలేజీ బంట్రోతుకి" అన్నాను. రామం ఆ చొక్కా నివిప్పి తెగచూసేడు. అది అప్పుడే చిరుగులు పట్టింది.

"వాడికిచ్చే బదులు ఈ చొక్కా నాకే యిచ్చికూడదూ?" అని ప్రాధేయపడుతూ అడిగేడు. హాస్యానికన్నమాట కాదని వాడి మొహం చెప్తూనే ఉంది.

"దానికేం తీసుకో" అన్నాను.

"ఈ చిరుగులు కొంచెం సరిచేస్తే మూడు నాలుగు నెలలు తోసేస్తుంది. చొక్కా ఉతుక్కుంటే అది ఆరేదాకా బరి ఒంటితో ఉండనక్కర్లేదు" అని దాన్ని పొదుపుగా మడతపెట్టి దండెని పెట్టుకున్నాడు.

"ఛీఛీ అదేం చొక్కారా! వెధవ చొక్కా! అంత బట్టలు లేనివాడివి యిన్నాళ్లూ ఎందుకు చెప్పేవుకావు? పెట్లోంచి చొక్కా తీసుకుంటే నేనేం కాదంటానా?"

"నా బతుక్కిది చాలు. ఈపాత బట్టలు బంట్రోతులకి పారేసేబదులు నా మొహంమీద పడెయ్" అని ఆ చొక్కా తీసుకున్నాడు. ఆ చొక్కా వాడిదగ్గిర మరో సంవత్సరం ఉంది. చిరుగులన్నిటికీ రఫ్ తీయించి కొత్తదాంతో సమానం చేయించేడు.

ఆరోజు దగ్గర్నుంచీ వాడంటే నాకు విపరీతమైన జాలివేసేది. అప్పట్నుంచీ నాతో తనగోడు చెప్పుకునేవాడు. సానుభూతితో విని సాయంచేస్తూ ఉండేవాణ్ని. చిరుగు పట్టిన చొక్కా అడగడానికి వాడికి చిన్నతనం వెయ్యలేదు. వాడి తండ్రి ఎలిమెంటరీ స్కూలు మాస్టరు. మనోవర్తి యిచ్చినట్లు మ్యునిసిపాలిటీవారు ఏదో జీతం యిచ్చేవారు. ఏదో ట్యూషను చెప్పుకుంటూ ఐదుగురి పిల్లలకి పెళ్లానికి తిన్నగా తిండి పెట్టలేక చచ్చేవాడు. రామాన్ని చూస్తే ఎంత జాలేసేదో వాళ్ల నాన్నని చూస్తే అంత రోత పుట్టుకొచ్చేది. మోకాళ్లు దిగని మురికిపంచె, కంపుకొడుతున్న చింకిపాత కోటు ఏడుపు మొహంతో, దరిద్రమూ అంటే ఓయ్ అని పలుకుతూ ఉండేవాడు.

అతని కొంతమాత్రం యిష్టంలేదు. రామం కాలేజీలో చేరడం. ఏడ్చిఏడ్చి వాడే చేరేడు. స్కాలర్‌షిప్ తప్పకుండా వస్తుందని ఆశ పెట్టుకున్నాడు. ఒక్కటిమాత్రం ఒప్పుకోవాలి. స్కాలర్‌షిప్ యివ్వవలసి వచ్చినప్పుడు మాయింటరు క్లాసు మొత్తానికి రామానికే మొట్టమొదట యివ్వాలి. చాలా చురుకైనవాడు. పేదవాడు. తెలివైన వాడు. వాడికి మాత్రం స్కాలర్‌షిప్ రాలేదు.

"ఈపాటికి చదువుకో సలాంపెట్టి ఎందులోనో ఓదాంట్లో బుర్ర దూర్చు. కాలేజీ చదువులు మనకెక్కడ సాగుతాయి?" అని వాళ్ళనాన్న దసరాకి దసరాపాట పాడ్డం ప్రారంభించేడు.

ఇదంతా రామం నాతో చెప్పుకుని ఏడ్చేడు. నేను మాత్రం ఏదో చిన్నచిన్న సహాయమైతే చేయగల్ను కాని పెద్ద ఫీజంతా కట్టమంటే నాతరమా? ఉపాయం మాత్రం లేకపోలేదు. మొదట ధైర్యం చాలింది కాదుకాని తీరా ప్రయత్నిస్తే అతి సుళువుగా రామానికి ఫీజు కట్టేసేం.

మాంచి యుద్ధకాలం. డబ్బు అందరిదగ్గిరా చిత్తుకాగితాల్లాగ చేరుతున్నాది. నలుగురి దగ్గిరకి వెళ్ళి వాడితోపాటు నేనూ వాడి సోదంతా చెప్పి హాయిగా ముష్టెత్తేసేం.

రామం యింటికి వెళ్దామని నిశ్చయించుకున్నాను. నేనీ ఊళ్లోనే ఉన్నట్టు వాడికి తెలియదేమో! లేకపోతే మాయింటికి రాకుండా ఉంటాడా? ఊళ్ళోకొచ్చిన


తక్కువధరలో మంచిరేడియో!
భారత్ రేడియో
ఎ.సి కరెంటు- 3 బ్యాండ్లు- రు. 185/-, 5 బ్యాండ్లు- రు. 275/-
డ్రై బ్యాటరీ- 3 బ్యాండ్లు- రు. 165/-
12 నెలలు గ్యారంటీ
వ్యాపారవివరములకు.
రేడియోసినెక్విప్‌మెంట్సు
బకింగుహామ్‌పేటపోస్టు., విజయవాడ-2



పారుగూరి ప్రయాణం

ఫొటో: నిప్పాణి గిరిధర్ - మద్రాసు.

తర్వాత వాడే మా యింటికి రావడం న్యాయం. తెలిస్తే వచ్చేవాడే. ఏదో ఆపాటి స్నేహితుడు నాకూ ఉన్నాడని నలుగురితో చెప్పొచ్చు అనుకున్నా. కాని వాడిదగ్గిరకి వెళ్ళడం పడలేదు. చేస్తున్నది బ్యాంకు నౌఖరీ. అది తీరికయిస్తేనా.

కాలేజీ రోజుల్లో నాకదొక గొప్పగా కనపడలేదు. "కాలేజీలో చేరిచేరడం నీ స్నేహం దొరకడం నిజంగా నా అదృష్టం." అని రాముం అస్తమానం అంటూనే ఉండేవాడు. "ఏడిసేవురా" అని నవ్వేవాణ్ణి. కాని వాడన్నమాట నిజమే. నా స్నేహంవల్ల వాడి అవసరాలు చాలా తీరేవి.

చనువంటే మాటలా? కాలేజీలో డబ్బులాడి తేరడమంటే చేరేదు. ఎన్నిఉంటే రెండేళ్ళూ పూర్తవుతాయి? కాలేజీ చదువులు మహామహావాళ్ళం అనుకునేవాళ్ళకే సాగటం లేదు. అలాంటిది ఆ రోజుల్లో రాముం సంగతి చెప్పాలా?

కాలేజీనుంచి యింటికెళ్ళేక ఉన్న ఒక్క పుస్తకమైనా తెరిచి చదువుకోడం కష్టమే. రాత్రి వాళ్ళింట్లో ఓ చిన్న గుడ్డి దీపం ఉండడం గగనమైపోయేది.

"ఎలక్ట్రిక్ లైటు నాకక్కర్లేదు కాని— శుభ్రంగా లాంతరు వెలిగించుకునే యోగం నాకు లేదు. ఆ కొట్టుమీదిచ్చిన ఓ కిరసనాయిలు సీసా వారంరోజులూ షరి పెట్టుకుందును. కాని ఏం లాభం? మా నాన్న ప్రతీ వారం ఆ కొట్టు ఎవడికో అమ్మి వచ్చిన డబ్బు పాతుంకో కేనికో వాడుకుంటాడు. సాయంత్రమే ముద్దమింగి చీకట్లో పడుకో వల్సింది. దరిద్రం ఓ ఎత్తూ, మా నాన్నో ఎత్తూ," అని ఏడ్చుకునేవాడు.

"హాయిగా నా రూమ్ కొచ్చెయ్యి. నా దగ్గిర మొహమాటం ఏమిట్రా? నీ త... కాయ!" అని దెబ్బలాడేను. ఆ రో... నించి వాడి బసా, చదువూ నా రూమ్‌లో... సాగేయి.

ఒక్క దీపమే కాదు. పుస్తకాలు, కా... తాలు అన్నీ నావే. నాలాంటివాడి... కాగితంముక్క కొనుక్కోడం కష్టమై... పోయేది. పాలమీగడలాంటి కాగితం మా... దేవుడెరుగు. బ్రౌను పేపరుకే దిక్కు లే... పోయేది. ఇవాళున్న ధర రేపటికి పెరి... పోయేది. తెల్ల కాగితాన్ని ప్రాణప్రదంగా

# ★ బంగారపు ఉంగరము ★

మానుకునేవాళ్ళం. రామానికి ఓ పెన్సిల్ కాని, ఓనోట్సుకాని ఉండేదికాదు. నా పుస్తకాలన్నీ వాడి స్వంతపుస్తకాల్లా వాడుకొనేవాడు. వాడి కా స్వేచ్ఛ నేనే యిచ్చేను. లెక్కలన్నీ నా రూమ్ గుమ్మ ముందు ముద్దముక్కల్లో చేసేవాడు. చదువులో కూశాఖం గట్టివాడే. ప్రతీ పరీక్షా ఫస్టుగా వచ్చేది.

పుస్తకాలు నావైతే నేం! దీపం నాదైతే నేం! వాడు అదృష్టవంతుడు. ఇంజనీరయ్యేడు. అంతకంటె కావల్సిందేముంటి?

వాడికీ విధంగా నే నొక్కణ్ణేకాదు. మా లాడ్జిమేట్సుకూడా సాయపడేవాళ్లు. తొడు క్కోడానికి షెంటు, చదువుకోడానికి పుస్తకమూ, రాసుకోడానికి పెన్నూ ఎవరో ఒకళ్ళం యిచ్చేవాళ్ళం అందరిసాయాన్నీ పుచ్చుకునేవాడు. నాదగ్గిర వాడి గోడు కూడా చెప్పుకుంటూ, నన్నంటిపెట్టుకుని ఉండేవాడు.

రామం జీతం బెడద ఎప్పుడైతే తీరిందో అప్పట్నించీ వాళ్ళనాన్న వాణ్ణి తిట్టడం మానీసేడు. అది బాగానేఉంది కాని మా లాడ్జికొచ్చి డబ్బారాసేవాడు. అతడు చెప్పే గోల యావత్తూ యిష్టంలేకపోయినా వినే వాళ్ళం. ఓనాడు పొద్దున్నే వచ్చేడు. వస్తూనే మొదలెట్టేడు.

"నిన్న రాత్రి మా రాముడు నీదగ్గర్నుంచి తెచ్చేడే, ఆ సాంబారు ఎంతో బాగుందయ్యాయి! పిల్లాపెద్దా అందరం జుర్రీసేం." అని ఓగంట నీళ్లుకారుస్తూ అతని చిన్నప్పుడు వాళ్ళింట్లో ఎంతబాగా వండుకునే వారో, అతని జిహ్వ ఎలా లేచొచ్చిందీ అంతా చెప్పేడు. నా కారియర్‌లో మిగిలి పోయిన సాంబారుని తీసుకెళ్లమని రామాని కివ్వడం నాకూ అలవాటైంది. తీసుకెళ్లడం వాడికీ అలవాటైంది. వాళ్ళింట్లో ఉప్పేసిన తరవాణీ నీళ్ళూ, అన్నం తప్పించి యింకో అధరువు-రాత్రివేళ ఉండేదికాదు. కూరా, సాంబారూ నా కారియర్‌లోవి తీసుకెళ్ళి తిండమే కాదు. ఒక్కొక్కరోజున మా అందరిముధ్యా మిగిలిపోయిన అన్నం తినే వాడు.

"ఇదిగో వీడో నాల్గురాళ్లు తెచ్చేవరకూ మాగతి యింతే. మీరందరూ దయతల్చి ఓకంట చూస్తున్నారు కాబట్టి నెట్టుకొస్తున్నాడు. లేపోతే నామొహం. నేను వాడికి చదువెక్కడ చెప్పించగల్ను? అందుకే మానీరా నాయినా, పైనింగైతే నువ్వు ఓ యాభై తెస్తావు అన్నాను. వాడు వింటేనా? కాలేజీలో చేరిపోయేడు. నీ ప్రాపు దొరికింది కాబట్టి బతికిపోయేడు. నేను నిజంచెప్తున్నాను బాబూ, నీలాంటి వాడు ఉండడు. గొప్పకీ మేర్నాణీకీ అంటం లేదు. చిన్నవాడివైనా నీగుణం ఉందే రాజాగుణం. అసలు మీవాళ్లందరూ అంతే. మీ వంశంవంశంయావత్తూ ఈ గుణంకలవాళ్ళే. మీ తాతగార్ని మీ నాన్నగార్ని నే నెరుగుదును. మీనాన్న మొన్న? ఆవిడలాంటావిడ లేదు. ఇప్పటికీ కోటిపల్లిలో ఆవిడపేరు చెప్పుకుంటారు. చేతికి ఎముకలేదు. మహా యిల్లాలు. ఆవిడ మనవడివి కాబట్టే నీకూ ఆ గుణం వచ్చింది." ఇలా మాట్లాడుతూ, మాట్లాడుతూ ముక్కు రెండుసార్లు చేత్తో రుద్దుకున్నాడు. బుర్ర మొత్తుకున్నాడు. రాని తుమ్ముకి ప్రయత్నం చేసేడు. ఆఖరికి అసలు విషయం ఎత్తుకున్నాడు.

"బాబూ చచ్చి నీకడుపున పుడతా. ఓ అఠాడబ్బు లిద్దూ. బుర్ర కాస్త పెక్కిపోతోంది. నిన్నటినుంచీ పొటుం లేదు. ఏపనీ తోచటంలేదు.

నువ్విచ్చినట్టు మావాడితో మాత్రం చెప్పకు. అందుకే వాడులేకుండా చూసి వచ్చేను. బాబ్బాబు," అని అడుక్కున్నాడు. అసలు విషయం ఎప్పుడు చెప్తాడా అని కాసుక్కూర్చున్నానేమో, అణా అనగానే జేబులోంచి తీసి అతని చేతిలో పెట్టేసేను.

"మావాడితో చెప్పకు కదూ?" అని మరో సారి అడిగి వెళ్ళిపోయేడు. మా తాతనీ, మా బామ్మనీ ఎత్తి మాట్లాడుతూ వుంటే నా ఒంటిమీద చీమలూ, జెర్రులూ పాకినట్లైంది.

ఎంతేనా అంటే, అతను చెప్పినంత దాన కులం కాదు మావాళ్ళు. ఎప్పుడన్నా, ఎవరి కన్నా కాసీ, పరకా యిచ్చేరేమో? ఇంత వాళ్ళని అత నేవాడూ ఎరగడూ యెరగడు. నాదగ్గర అఠాడబ్బులు పుచ్చుకోడానికి మా వంశాన్ని దానశీలురని మూడు గంటలు డబ్బా కొట్టేడు. అతనికి మా వంశమే కాదు, అందరి వంశాలూ యిలాగే తెల్సు. అతని అడుక్కునే తీరే అంత. ఎప్పుడూ దేనికో ఓదానికి యిలాగే కేబిరిస్తూ వుండేవాడు, అతనలా అడిగి తీసికెళ్తాడని రామానికి తెల్సు.

రామాన్ని చూసి లాడ్జిమేట్సందరూ జాలి పడ్డా, వాళ్ల బాబు డబ్బాకి విసుక్కునే వారు. కసురుకొనేవారు. రామం నా అప్త స్నేహితు డవడాన్ని వాళ్లబాబు అడుక్కున్నా, దేబిరించుకున్నా నే నేమీ అనుకునేవాణ్ణి కాదు.

వాడు కిప్పుడు ఇంజనీరయ్యేడు. బహుశా ఆ బ్రాహ్మడికీ హుందాతనం వచ్చే వుంటుంది. ఓసారి రామందగ్గిర కెళ్లాలి. వాళ్లనాన్న ఎలావున్నాడో సంగతీ, సందర్భం కనుక్కోవాలి. రోడ్లమీద రామం కారు చాలాసార్లే తటస్థపడ్డాది. వాణ్ణి నేను గుర్తుపడుతూనే వచ్చేను. వాడు నన్నెందుకు గుర్తుపట్టలేదని అనుమానం వేసింది. నా మొహంలో పెద్ద మార్పేమీ రాలేదే! వాడు నన్ను నిర్లక్ష్యంగా చూస్తున్నాడా? అలాగే అయితే అంతకన్నా నీచత్వం యీ ప్రపంచంలో ఉండదు.

నేనొక మహోపకారం చేసేనని అనుకో లేదు. స్నేహితుడికి ఆమాత్రం సహాయం చెయ్యడంలో గగనమేమీ లేదని ఆనాడు అనుకున్నాను. నిజానికి నేనానాడు చేసిన ఉపకారం రామం బతుక్కి ఉపకారం. వాడి జీవితమార్గాన్నే మార్చేను. ఏమంటే రామం కాలేజీలో ఇంటరు రెండేళ్ళ జీతాలూ ముప్పైతుతూనే కట్టేం. కాని చివరకి అంతా రసాభాసు అయిపోయింది. రామం అడగవలసిన వాళ్ళనందర్నీ అడుక్కున్నాడు. అందరూ ఇవ్వనూ ఇచ్చేరు. వచ్చిన డబ్బుమాత్రం ఫలితం దక్కించింది కాదు. ఇంత కష్టపడి అడుక్కు తెచ్చిన డబ్బులో వాళ్ళనాన్న ఏకో కీకలమీద కొచ్చిందని కొంత పులుసులో పడేసేడు. యూనివర్శిటీకి పరీక్షకి కట్టవలసివచ్చింది. ఆవెంటనే పెర్మ్‌ఫీజు కట్టవలసివచ్చింది. ఇహ నెవర్ని అడుక్కోడం?

నాకు రామం తండ్రిని తందామన్నంత కోపం వచ్చింది. ఎలాగో తంటాలు పడి అతనే కడతాడనుకున్నా. ప్రయత్నిస్తున్నానేవాడు వాళ్ళ నడుగుతాను, విళ్ళనడుగుతానన్నేవాడు.

"ప్రయత్నిస్తే ప్రయత్నించండి, లేక పోతే మానెయ్యండి పరీక్ష కెళ్ళక పోతే మళ్ళా తిరిగి కాలేజీలో చదువుకోవాలి.


సుగంధికా
సరస్వతీ తైలము
మెదడుకు,చల్లదనముకు,
కన్ను,ముక్కు,చెవి, వ్యా
ధులకు,32 సం॥నుండి
ప్రపంచమంతటావాడుచున్న
ఒకసారివాడినతెలియును
మీపెద్దలందరి
వద్ద దొరుకును.
ఈష్టన్ మెడికల్ వర్క్సు
కాకినాడ.
డిస్ట్రిబ్యూటర్లు: సీతారాంజనరల్ స్టోర్సు
(ఏజెన్సీస్,) విజయవాడ-1.

అది మాత్రం చూసుకోండి" అని గట్టిగా అతనితో చెప్పేను.

"నాకు మాత్రం తెలీదా బాబూ! ఎవరి కాళ్ళో పట్టుకుంటాను. తెస్తాను" అనే వాడు.

"పెర్మ్ ఫీజుమాట తాపీగా చూసుకోవచ్చు. మొదట పరీక్షకి కట్టాలి. జ్ఞాపకం ఉంచుకోండి" అని కూడా చెప్పేను. ఒకటా? రెండా? పలభై ఏడు రూపాయలు! వ్యవధి మూడు రోజులే ఉంది. దిగాలు పడిపోయి రామం ఊరంతా తిరిగేడు.

"ఏం రా? ఏమన్నా ..."అని అడిగేను.

"దరిద్రుణ్ణి, దురదృష్టవంతుణ్ణి లాభం లేదు. ఇహ నా బతుకింతే" అని చేతుల్లో మొహం దాచుకున్నాడు.

"మరేం ఫర్వాలేదురా. ఇంకా టైముంది గా. మీ నాన్నగారే ఎక్కడన్నా తెస్తారు" అని వాడికి ధైర్యం చెప్పేను. వాడికేదో ధైర్యం చెప్పేనన్నమాటే కాని అతనేం చేస్తాడో అని నాకు అనుమానంగానే వుంది.

తీరా ఆఖ్రరోజు వచ్చినా రామం పరీక్షకి డబ్బు కట్టలేదు. పొద్దుణ్ణించీ వాడి కోసం ఎదురుచూస్తూ కూర్చున్నాను, 'డబ్బు పట్టుకుని వస్తాడు కట్టేయ్యొచ్చు' అనుకుంటూ. మధ్యాహ్నం ఒంటిగంటకి ఏడుపు మొహం పెట్టుకుని వచ్చేడు. బూడిదలో పోసిన పన్నీరైందన్నాడు. వాళ్ళ నాన్న చాలా ప్రయత్నాలు చేసేట్ట. ఎక్కడా పలకలేదుట వాడా మాట చెప్పగానే కొయ్యైపోయేను. సిద్ధాన్నాన్ని కుక్క ముట్టుకున్నట్లయింది. రెండేళ్ళ చదువు దండగే. రామాన్ని చూస్తూ ఉంటే నాకు జాలీ, దుఃఖం వచ్చేయి.

"మా నాన్న మొదట్నించీ మానెయ్ మానెయ్ అనే ఆశీర్వదించేడు కాని, చదువుకోరా అని ఒక్క నాడన లేదు. బద్ధ మనమే లాక్కున్నా మా నాన్నే పసివాకి కన్నం పెట్టేసేడు. ఇక మానాన్న కోరుకున్నట్టూ, రోట్లో తలదూర్చి రోకళ్ళతో దంపించుకోడమే" అని నిస్పృహతో అన్నాడు.

ఏంచెయ్యడం? ఎక్కణ్ణించి తేవడం? ఏవిటి దారి? లాడిమేట్సందరూ 'అయ్యో పాపం.' అని విచారించేరు. వాళ్ళు మట్టుకు అంతమొత్తాన్ని ఎక్కడివ్వగల్రు?

బాధతో చచ్చిపోతున్న రామం చెయ్యిపట్టుకుని ఆ మిట్టమధ్యాహ్నం, ఆ తైవర్తకుడి కొట్టుకెళ్ళి నా వేలి ఉంగరం తాకట్టుపెట్టి మా కొక్కవల్సిన డబ్బు తెచ్చేం. నా వేలిని ఆనాడున్న నీలంపొడి ఉంగరం మా పెదనాన్నగారు నా ఉపనయనంనాడు బహుమానంగా యిచ్చేరు. మొన్న మొన్నటిదాకా నా చేతినుండేది. ఈ మధ్యనే మా పాపాయి గొలుసులో పడి





ఓవల్‌టిన్

ఆదర్శమైన కుటుంబ పానీయము

సాధారణంగా ప్రమాణంలోను, నాణ్యత లోను నిత్యపోషణ చాలినంత కలిగి వున్న ఆరోగ్యమైన కుటుంబాలే ఆనందంగా వుంటాయి. ఆరోగ్యానికి ముఖ్యమైన ద్రవ్యములు ఒక్కొక్కప్పుడు మామూలు ఆహారములో లోపించి వుంటాయని తెలిసివున్న వివేకంగల చాలమంది గృహిణులు, నిత్యాహారమునకు అదనంగా "ఓవల్‌టిన్" గూడ తమ కుటుంబానికి యిస్తుంటారు. రుచికరమైన "ఓవల్‌టిన్" వ్యయంచేసిన బలం పూర్తిచేయడానికి, రాత్రిళ్లు హాయిగా నిద్రపట్టడానికి ప్రతివారికి ప్రయోజనకారిగా వుంటుంది. అది, పండిన బార్లీ మాల్టు సారము, శుద్ధమైన మీగడ ఆవుపాలు, ప్రత్యేకంగా తయారుచేయబడిన కోకో, యింకను స్వాభావికమైన పాస్ఫేట్లు, విటమినులు కలిగిన మిశ్రమము. ఇందులో ఇంకను బి డి విటమినులు చేర్చబడినవి. "ఓవల్‌టిన్" కొంటే చాల లాభకరము. దీనితో సమానమైనది లేదు.

డిస్ట్రిబ్యూటర్లు: గ్రాహమ్సు ట్రేడింగు కంపెనీ (ఇండియా) ప్రైవేట్ లిమిటెడ్.

ఓవల్‌టిన్

ప్రపంచంలో అభిమాన పాత్రమైన ఆహార-పానీయము




సిలోన్ రేడియోమీద శనివారాలు రా. 8 నుండి 8-30 గం.ం వరకు 'ఓవల్‌టిన్' ఎమెచూర్ కార్యక్రమం వినండి (హిందీ-41,72 మీటర్లు)

IV. 144

# ★ బంగారపు ఉంగరము ★

పోయి ఉంగరం రూపాన్ని కోలుపోయింది. ఆ ఉంగరం, ఆ నాడు వేలుకి ఉండబట్టి నిలుచున్న పాళంగా మిట్టమధ్యాహ్నం వెళ్ళినా డబ్బుని పలికించింది. ఆ త్రైరద్దీ పడు రూపాయికి వెలకి కాణీ చొప్పున లాకట్టుపట్టినా, డబ్బంటూ సుముహూర్తపు వేళ మించిపోకుండా యిచ్చేడు. కాలేజీ గుమాస్తా బ్యాంకుకి డబ్బు తీసుకెళ్లడానికి సిద్ధంగా ఉన్న ఆ ఆఖరిక్షణంలో రామం పరీక్షకి డబ్బు కట్టేడు. ఆనాడు వాడిగండం తప్పించేను.

తర్వాత వడ్డీతోసహా ఆ అప్పు నేనే తీర్చుకున్నాను. ఇచ్చేస్తానన్నాడు. కాని వాళ్ళ నాన్న చిల్లిగవ్వ యివ్వలేదు. నేను నొక్కి అడగనూలేదు. ఆ వేళ రామం నన్ను కౌగలించుకొని వాడు ఉద్యోగంలో ప్రవేశించిన వెంటనే వడ్డీతోసహా నా డబ్బు నాకిచ్చేస్తానని చెప్పేడు. కాని వాడూ ఆ సంగతి మర్చిపోయినట్టే ఉన్నాడు. వాడు తిరిగి ఇస్తాడని ఆనాడూ అనుకోలేదు. ఏనాడూ అనుకోలేదు.

ఆ చిన్న సహాయం నే నానాడు చెయ్యక పోతే రామం పని ఏమవును? ఇంటరు క్లాసు పోయి, నాలాంటి నౌఖరీ ఏదో చేస్తూ ఉండును.

ఫస్టుక్లాసులో ఇంటరు ప్యాసయ్యేడు. వాళ్లి వేలువిడిచిన మేనమామ, ఇంటరు ఫస్టుక్లాసులో ప్యాసవడాన్నీ కుర్రాడు తెలివైనవాడైన కారణాన్నీ, పనికొస్తాడని, పిల్లనిచ్చి పైచదువు చెప్పించుకోడానికి పూనుకున్నాడు. ఇంజనీరింగు కాలేజీలోనే సీటు వచ్చింది. అదృష్టం తోసుకొచ్చింది. రామం యింజనీరయ్యేడు.

తెరిపి చేసుకుని నేనే వెళ్లేను యింజనీరు గారి బంగళాకి. లోపల్నించి కంట్రాక్టర్లు యిద్దరు వస్తున్నారు. కంట్రాక్టరు సత్యం నాకు తెలిసున్నవాడే.


కలవరపడు స్త్రీలకు

"కుమారి"(మాత్రలు) మరువకండి మీ ఆరోగ్యం రక్షించును. చింతఅనవసరం

నెం (సాదా) రు. 3/-
(స్పెషల్) 5/-
(ఎస్ట్రాక్ స్పెషల్) 8/-
పోస్టేజీ ప్యాకింగ్. ప్రత్యేకం

Mrs. P. Devee, F.D.S. (AP) Calcutta-40.
స్టాకిస్టు: Indo Medical supplies
No. 3, Paullappan st, Seven wells
Madras - 1.


నన్ను చూస్తూనే, "ఏం బాబుగారూ" అని పల్కరించేడు.

"ఇంజనీరుగారున్నారా?" అడిగేను.

"ఉన్నారండీ పొద్దున్నే కాంప్‌నించి వచ్చేరు. మీ కేమిటిలా వచ్చారు?" అన్నాడు.

"నేనూ ఆయనా బాగా స్నేహితులం. ఇద్దరం కలిసి చదువుకున్నాం" చెప్పేను.

ఏమిటే? చెప్పేరికాదే! అయితే యిహ మాకు ఫర్వాలేదు. మీవల్ల మాపన్లు జరుగుతాయన్నమాటే. లోపలకెళ్లండి. హాయిగా మాట్లాడుకోవచ్చు. ఇవాళే ఏమిటి మరి నాలుగురోజుల్దాకా కాంప్ లేదు. ఇంటి దగ్గరే ఉంటారు" అని సత్యం వెళ్లిపోయేడు.

మెట్లెక్కి వరండామీద కెళ్లేసరికి బంట్రోతు ఎంతో మర్యాదగా నేనెవర్నో కనుక్కున్నాడు.

"కాంప్ నాలుగురోజుల్దాకా లేదు. యింట్లోనే ఉన్నారు," అని లోపలికెళ్లి నేనొచ్చినట్టు చెప్పేడు. డ్రాయింగు రూమ్‌లో ఉన్న ఫర్నిచరు, రేడియో, గోడనున్న ఫోటోలూ చూస్తూ నిల్చున్నాను. వచ్చేడు రామం. వస్తూనే నన్ను కౌగలించుకొంటాడనుకున్నా. ఎంతో అభిమానంతో తీసుకెళ్లి తన పక్క కూచోపెట్టుకుని పాత కష్టాలు పోయి కొత్త జీవితంలో అడుగు పెట్టేనని అన్ని విషయాలూ మాట్లాడుతాడనుకున్నాను. వాడేమాటా మాట్లాడకుండా నిటారుగా నిల్చున్నాడు. వాడి మొహంలో స్నేహితుడి వాత్సల్యం ఎక్కడా కనపడలేదు. వీడెందుకొచ్చినట్టూ? అని ప్రశ్నిస్తున్నట్టుంది వాడిమొహం.

"జ్ఞాపకం ఉన్నానా?" అన్నాను మౌనాన్ని భరించలేక.

"నువ్వు గోపాలానివికదూ? కారులో వెళ్తూ చూశా. నువ్వే అనుకున్నా" అన్నాడు. నన్ను పోల్చిన తర్వాత కారాపి పలకరించవల్సింది. తెలీనట్టే వెళ్లిపోయేడు. ఎలాంటి మనిషి.

"నువ్విక్కడికి వచ్చినట్టు తెలీగానే వద్దామనుకున్నా. తీరుబడి కాలేదు" అన్నాను.

"అలాగా?" అని మొహం ముడుచుకున్నాడు.

"వెధవ ఉద్యోగంలో తీరికంటూ ఉండదు. చచ్చిపోతున్నాను. పొద్దున్నొచ్చేను. ఇప్పుడు మళ్లా పావుగంటలో కాంప్ కెళ్ళాలి. ఊపిరి సలుపుకోడానికి వీలు చిక్కటం లేదు", అని పెద్దపన్లో ఉన్నవాడిలా మాట్లాడేడు.

"అవునవును. నీ బంట్రోతూ, కంట్రాక్టరు సత్యం, నువ్వు కాంప్‌కెళ్లే సరంజామాలో ఉన్నావనే చెప్పేరు" అన్నాను.

[illegible]గ్రాముల విషయం వాళ్లకేం తెలుస్తుంది? ఏదో అలా అనుకుంటారు" అన్నాడు. వాడు కూచోలేదు. నన్ను కూర్చోమనలేదు. ముళ్లమీద నిల్చున్నట్టు నిల్చున్నాడు. వాడి మాటా, తీరూ చూసేక వీడు నా చిన్ననాటి రాముడేనా అనిపించింది. నా కక్కడ ఉండ బుద్ధిపుట్టింది కాదు.

"మీ నాన్నగారు కులాసాగా ఉన్నారా?" వెళ్లిపోదామనుకుంటూనే ఈ ప్రశ్న వేసేను. వాణ్ణీ, వాడి తండ్రినీ, వాళ్లి పరిస్థితినీ నేను మర్చిపోలేదని వాడికి గుర్తు చేయాలనే అడిగేను. వాళ్ల నాన్న ఊసెత్తేసరికి వాడి మొహం వివర్ణమైంది.

"కులాసాగానే ఉన్నారు. పెద్దవాడయ్యేడు" అన్నాడు.

"కాకినాడలో ఆ యింట్లోనే ఉంటున్నారా?"

"ఆ అక్కడే ఉంటున్నారు."

"ఆయనకో ఉత్తరం రాయాలి. రిటైర్డు ఎలిమెంటరీ స్కూలు మాస్టరంటే ఆయనకి అందుతుంది కదూ?"

"అందుతుంది." వాళ్ళ నాన్న విషయం మాట్లాడుతూ ఉంటే వాడికి బాధగా ఉంది.

"పాపం. ఆయనకి ఏదన్నా బహుమానం పంపించాలి. ఏదో ఎందుకూ? ఆయన పాడుంకి చిన్నమారేడుకాయ పంపిస్తాను. ఆయన మా యోగ్యుడు. నువ్వంతకన్నా యోగ్యుడివి" అని వాడి మొహంలోకి "ఓరి తుచ్ఛుడా" అన్నట్టు తీక్ష్ణంగా చూసేను. వాడి మొహాన్ని కత్తివేటు వేసినా నెత్తురు లేదు. నా డెంత ఇంజనీరైపోయినా వాడోక అథముడైన సంగతి వాడికి బోధపడేటట్టు చేసేననే అనుకున్నాను. వాడి గుమ్మంలోంచి కాండ్రించి ఉమ్మి, వెళ్లిపోతాననైనా చెప్పకుండా పరమ అసహ్యంతో వెళ్ళిపోయేను.

వాడి కృతఘ్నతకి క్షమాపణ చెప్పుకుంటూ వాడు మా యింటికి వస్తాడని అనుకోలేదు. వాడు మా ఊళ్లో ఉన్నంత కాలం మా యింటికి రానూలేదు. ★


బొల్లి

మహాపాడ. సమస్త చర్మవ్యాధులకు అమోఘ చికిత్స

క్యాటలాగు సెలవ్ వుచితం

జి.వి.రెడ్డి & కో
రిజిష్టర్

భాస్కరాశ్రమము
గోపాలపురం
తూర్పుగోదావరి జిల్లా

# అలకపాన్పు

గుంటూరు.

"ప్రియమైన శకుంతల చూచుకునేది.

ఇక్కడ నేను క్షేమముగానే వున్నాను. నీ ఒంట్లో ఖులాసాగా లేదని విన్నాను. ఇపు డెలా వుంది? ఆరోగ్యము విషయములో ఏమాత్రం అశ్రద్ధ వహించకు. చాలా జాగ్రత్త సుమా! నేను ఎక్కడో దూరానకూడా వున్నాను, నీ విషయం పట్టించుకుంటా మనుకుంటే. మీ అమ్మగారిని తీసుకుని ఒకటికి రెండుసార్లు లేడీ డాక్టరు దగ్గరకు వెళ్తూండు.

ఈ మధ్య మీ నాన్నగారు ఒకవుత్తరం వ్రాశారు. ఆ సంగతి నీకు చెప్పారో లేదో వాళ్ళతే తెలీదు గాని అందులోని విషయాలు చాలా బాధకరముగావున్నాయి. నేను అమితముగా డబ్బు అడిగానని, ఇక నా చదువు బాధ్యత తన కేమీ లేదని, స్పష్టంగా వ్రాశారు. నా చదువువిషయములో బాధ్యత వహించినందుకు నే నేమీ దిగులుపడను. పైగా అంత నిర్మొహమాటంగా చెప్పినందుకు సంతోషిస్తాను. కానీ ఒక సంగతి. ఏదో కట్నం లేకుండానే నిన్ను చేసుకోమన్నారు. నిన్ను చూడగానే నేనూ సరే నన్నాను. "కట్నం తీసుకోను నాకు చదువుమాత్రం చెప్పించాలి అనే మాదిరి షరతులు నేను పెట్టలేదు. ఆ విషయం నీకూ తెల్సును. వివాహమైన తరువాత మొన్న జూన్‌లో పై చదువుకు వెళ్ళమని, తనకు తాను వచ్చి నన్ను బలవంతం పెట్టిన సంగతికూడా నీకు తెల్సును. కేవలం తన ఒత్తిడిమీదనే నేను పై చదువును అంగీకరించి, ఈ గుంటూరుకు వచ్చానంటే నువ్వు ఒప్పుకుంటావు. మా నాన్నగారి దగ్గర్నుంచి దమ్మిడీ తెప్పించుకో నక్కర్లేదని ఎన్నోసార్లు అన్న మాటలు నీకు గుర్తుండే వుంటాయి. ఏమయినా పొరబాటు నాదయిపోయింది. తొందరపడి వచ్చాను. ఆనాడు మా చెల్లాయి అన్న మాటలు విన్నా బాగుండిపోయేది. ఒకరి ధనసహాయంమీద విద్య నభ్యసించాలంటే చాలా కష్టం. త్వరపడి పొరబాటు చేశాను. శిక్ష అనుభవించాను.

నేను మా కాలేజీ యూనియన్‌కి అధ్యక్షుడుగా ఎన్నికైనట్టు మీ నాన్నగారు చెప్పే వుంటా రనుకుంటాను. అప్పటినుంచి నాకు ఎక్కడలేని గౌరవమూ జరుగుతూవున్నది. కాలేజీలో అడుగుపెట్టినప్పటినుంచి ప్రతి విద్యార్థీ నాకు విష్ చేస్తున్నారు. నాకు అమిత సంతోష మేస్తున్నది. ఎన్నికైనాను గదానని, గర్వపడక వాళ్ళకు ఎంతో కృతజ్ఞత తెల్పుకుంటున్నాను. చివరకు కాంటీను వాడు, ఎలక్ట్రిషియన్ గంగాధరం కూడా అన్నిపనులు త్వరగానూ, శ్రీఘ్రానూ చేసిపెడుతున్నారు. మొన్న ఆంధ్రరాష్ట్ర మంత్రులు వచ్చినపుడు సభలన్నీ నిర్వహించినది నేనే. మంత్రులందరితోనూ టీపార్టీలు, ఫొటోలు అమితముగా జరిగినాయి. ఇంతకీ నేను చెప్పేదేమిటంటే నాకు ఇక్కడ పదిమందిలోనూ గౌరవమర్యాదలే గాకుండా, పరువుప్రతిష్ఠలు బాగా పెరిగినాయి. ఈ సంగతి మీ నాన్నగారు గ్రహిస్తే అదేచాలు.

శకుంతలా! ఇవన్నీ ఇక్కడ పొందేటందుకు ఏది ముఖ్యమో నాకు తెల్సు. ఆ నీటిజల ఆగిపోయింది కనుక నేను తుదకు ఒక నిశ్చయాని కి రాక తప్పలేదు. మా నాన్నగారికి వుత్తరము వ్రాశాను. వాల్గూ మంగళ హారతులు ఆయన జాబులో దొరికినాయి. "నోరు మూసుకుని, పెట్టె బేడ కట్టుకుని బయల్దేరి రా, ఏదో వుద్యోగం చేద్దువుగాని" అని వ్రాశారు. కనుక ఇక్కడ సర్వ గౌరవ మర్యాదలు వదులుకుని మా వూరు వెళ్ళిపోతాను. పై చదువు నాకు దొరకదు.

ప్రతిష్ఠలు ఇక పొందలేనని దిగులు కన్నా, నన్ను ఎన్నుకున్న మూడువేల మంది విద్యార్థులు చాలా నిరుత్సాహ పడగలరనే దిగులు పట్టుకుంది. నావల్ల తామేదో పొందాలనుకుని వుంటారు కనుక ఇపుడు వారి ఆశలు నిష్ప్రయోజనాలు కాగలవు! అందుచేత వారి నందరిని ఒప్పించి శెలవు తీసుకుని ఓ వారము రోజులలో వచ్చేస్తాను, విద్యార్థుల కన్నా, మా ప్రిన్సిపాల్ వద్ద శెలవు తీసుకోవడం చాలాముఖ్యం. ఆయనకు నేనంటే బహుప్రీతి. నేనేదో గొప్పవాడై పోవాలనీ ఆయన కోరుకుంటూంటారు. ఆయనతో కాలేజీ విడిచి వెళ్ళిపోతున్నానంటే ఎంతో బాధపడిపోతారు! ఏమైనా దేవుడి నిర్ణయాని కి తిరుగులేదుగదా! ఏదో విధముగా అందరి శెలవు పొందకపోను. తాత్కాలికముగా బాధపడినా నన్ను వదలక తప్పదు. వచ్చిన కన్నీటిబిందువులను తుడుచుకుంటాను. అవే ఆనందబాష్పాలని సంతృప్తిపడతాను. గుంటూరులో నా జీవితం కొన్నాళ్ళే అనుకుంటాను.

నీకు వుత్తరం వ్రాస్తూ వుంటే రాముం వచ్చాడు. నా నిర్ణయం విని నాకన్నా దుఃఖపడింది వాడొక్కడే!! ఇద్దరమూ చాలా అన్యోన్యంగా వుంటూ వచ్చాం. ఒకే గదిలోనే కాకుండా ఒకే విస్తట్లో భోజనం చేస్తూ వచ్చాం. భోజనం చేసేటపుడు నువ్వు గుర్తుకు వస్తావురా, ఎపుడు రాకపోయినా!! అని వాడు వాపోయాడు. తన తండ్రిని అడిగి మరోచంద తెప్పిస్తాను, ఇక్కడే వుండిపోరా అన్నాడు పాపం! కానీ ప్రథమ అనుభవములో చాలా బాగా తెల్సుకున్నాను. మరెవ్వరిపైనా ఆధారపడను. అది నా బుద్ధితక్కువ.

శకుంతలా ఇక ముగిస్తాను. ఈ మాట మా వూరుకు మా నాన్నగారి అడ్రసుకే వుత్తరం వ్రాయి. ఇక్కడకు వ్రాయకు. వారంరోజుల్లో అన్ని సరదాలు ముగించి వచ్చేస్తున్నాను. ఇందుకుగాను నువ్వేమీ విచారించకు. ఆరోగ్యం మాత్రం శ్రద్ధ వహించు.

మరదలూ, బావమరిదీ ఖులాసా అనుకుంటాను. మీ అమ్మగార్కి నా నమస్కారములు. వుత్తరం చదవగానే చించేస్తే చాలా మంచిది.

వస్తాను.

నీ

ఆనందరావ్."

* * *

గుడివాడ.

"పూజ్యులైన భర్తగారికి

నమస్కరిస్తూ వ్రాయునది,

మీరు దయతో వ్రాసిన కవరు అందినది.

కొంపల్లి బ్రహ్మానందరావు

# ★ అలకపాన్పు ★

మా నాన్నగారు జరిగిన సంగతి చెప్పారు. ఆయన ఒట్టి తొందరమనిషి. మా అమ్మకూ ఆయనకూ రోజూ తగులాటే. ప్రతి విషయంలో అంత తొందరగా నిశ్చయానికి రావద్దంటుంది అమ్మ. నాకు తెల్సులే... అంటూ నాన్నగారు అరుస్తూ వుంటారు. అది వారికి మామూలైపోయింది.

మీమీద నాన్న చేసిన తొందర నిర్ణయం మాకెంతో బాధకలుగజేసింది. అమ్మ ఈ విషయంలో గట్టిపట్టు పట్టింది. నూరు అరయినా, అతి నూరయినా, మీ చదువుకు మాత్రం భంగం రాకూడదని ఆవిడ పట్టుదల. అందుకని మీరు అక్కడనుంచి బయల్దేరకండి. కాస్త ఓపికపడితే తిరిగి అన్ని పరిస్థితులూ సర్దుకుంటాయి. అదీగాక రేపు మా చిన్న బాబాయ్ తెనాలినుంచి వస్తారు. ఆయనతో సంప్రదించి, నాన్నని ఒప్పిస్తాను. మీరు గుంటూరుకు వెళ్ళినది, కేవలం మా ప్రోద్బలంమీద నేనని మా కందరికీ తెల్సు. అందుకనే అమ్మ మంకుపట్టు పట్టింది. పెద్దల్లుడికి ఇలా చేస్తే రెండో అల్లుడు ఎలా వస్తాడనుకున్నారండీ మరీనూ!! అంది నాన్నతో. నాన్న చేసిన తొందర పని త్వరలో నాన్నే సర్దుతారని నమ్మకం నాకుంది. అందువలన మీరు ఎట్టి పరిస్థితులలోనూ బయల్దేరవద్దు. బయల్దేరితే నామీద ఒట్టే!!

మీ ఆరోగ్యం బాగా వుండాలని కోరుకుంటున్నాను. నేను కులాసా.

ఇట్లు
శకుంతల."

* * *

గుంటూరు.

"ప్రియమైన శకుంతలకు,

నీ లెటరు అందినది. నీవు కులాసాగా వున్నందుకు సంతోషం. నా విషయములో నువ్వు జోక్యం కల్గించుకోకు. నాకేమాత్రం ఇష్టంలేదు. మీ కుటుంబములో నన్ను గురించి అనవసరముగా జగడాలు పెంచుకోవడం నా మనస్సుకు ఎంతో బాధకలిగిస్తూన్నది. మీ అమ్మగారిని నా విషయము పట్టించుకోవద్దని చెప్పు. అభిమానం వున్నవాడిని కనుక నా చదువుతో ఇక మీకు ప్రసక్తిలేదని మరీ మరీ చెప్తున్నాను. మీ వాళ్ళందరితో చెప్పు.

గత నాల్గురోజులుగా మా కాలేజిలో వారోత్సవాలు ముగిసినాయి. అన్నీ చాలా బాగా జరిగినట్టు వేరే చెప్పనవసరంలేదు. ఆర్గనైజింగ్‌కు నాకో పెద్దకప్పు బహుమానం వచ్చింది. ఈ మారు మీ వూరు వచ్చినపుడు చూపిస్తాను.

నాల్గురోజుల్లో గుంటూరుకు స్వస్తి చెప్తున్నాను. లెవల్ క్రాసింగునుండి జిన్నా టవరువరకూ వున్న మద్రాసు మౌంటు రోడ్డుమాదిరి రోడ్డుమీద ఇక పనివుండదు. కాలేజీ ఆ రోడ్డుమీదనే కాబట్టి కడసారిగా రేపు నడుస్తాను. చైనాబజారును గుర్తుకు తెచ్చే ఆ బజారులో నాకున్న పని రేపే పూర్తిచేసుకుంటాను. రాయల్ సిల్కు సెంటరులో పర్చేజెస్ ఈ రోజునే సగమయింది. ఈరోజే సాయి కృష్ణానంద భవన్‌లో కొద్ది అక్కౌంటు కూడ తీర్చేశాను. ఇక నాకున్న కొద్దిపనంతా రేపటిలో పూర్తవుతుంది. అందుచేత మూడురోజుల్లో తప్పక మా వూరు వెళ్ళిపోతాను. నువ్వు చెప్పినట్టు వినకుండా బయల్దేరుతున్నానని నామీద కోపం తెచ్చుకోకు. ఒటమీదా, ప్రమాణాల మీదా నాకు నమ్మకంలేదని నీకు తెలుసుననుకుంటాను.

ఇట్లు
నీ
ఆనందరావ్."

* * *

గుడివాడ.

"పూజ్యులు భర్తగారికి,

నమస్కారములు. మీ జాబు అంది, సంగతులు తెలిసినవి. మా చిన్నబాబాయ్ నాన్నగారితో గట్టిగా చెప్తానన్నాడు. అమ్మకూడా బాగా వేధిస్తోంది. ఉన్న కాస్త మొత్తం ఖర్చుచేసుకుంటే మా అరుంధతి వివాహం ఎలా అవుతుందని నాన్నగారి భయం. చదవమని పంపించి సగములో వదిలెయ్యటం అప్రతిష్ఠ పని అని మా బాబాయ్ అంటున్నాడు.

మీ సలహా ననుసరించి ఈవిషయములో నేను జోక్యం కల్గించుకోను. ఇటు కన్న తండ్రికీ, అటు కట్టుకున్న భర్తకూ మధ్య నలుగుతున్నాను. అందుచేత మీ ఇష్టప్రకారమే మీరు నడుచుకోండి. రమ్మనమని గాని, వద్దని గాని నేను వ్రాయను. నా ఆరోగ్యం బాగానే వుంది. చెల్లాయి అరుంధతి, తమ్ముడూ కులాసాగానే వున్నారు. మా అమ్మకు ఈమధ్య కొంచెం సుస్తీచేసింది. ఇపుడు నెమ్మదిగానే వుంది. మీ ఆరోగ్యం బాగా వుందనుకుంటాను. మీ శకుంతల"

* * *

గుంటూరు

"ప్రియమైనశకుంతలను దీవిస్తూ వ్రాయునది.

నీ కార్డు అందినది. చెప్పవలసినవారందరితోనూ చెప్పాను. మా ప్రిన్సిపాల్ గారికి మాత్రం ఇంకా స్వయముగా చెప్పలేదు. నేను చదువు మానుకుంటున్నానని కాలేజీలో బాగా పాక్కిపోయింది. ప్రతి స్టూడెంటూ వచ్చి కారణం అడిగేవాడే. అనివార్యకారణాలమూలాన మానుకుంటున్నానని చెప్తున్నాను. మీ నాన్నగారి చర్య చెప్తానని భయపడతావేమో, ఆభయం అవసరంలేదు. కల్చరు వున్నవాణ్నే! మా యూనియన్ మెంబర్సెవరో ప్రిన్సిపాల్ గారి చెవిన వేశారట! 'అబ్బే! అతనెందుకు పోతాడు! ఒట్టి అబద్ధం' అని అంటున్నాడు. అందుకని అన్నీ ముగించుకుని బయల్దేరేటపుడు ఆయన్ని కలుసుకుంటాను. లేకపోతే ఆయన వద్దని పట్టుబడతారు. అందుచేత నేను ఎల్లుండి తెల్లారి కర్నూలు ఎక్స్‌ప్రెస్‌కి వెళ్లిపోతాను. నా ప్రయాణం ఖాయం.

ఇట్లు
ఆనందరావ్."

* * *

గుడివాడ

"పూజ్యులు భర్తగారికి,

నమస్కారములు. మీరు వచ్చేస్తున్నందుకు దిగులూ, సంతోషమూ రెండూ వస్తున్నాయి. మీవూరు వెళ్ళేటప్పుడు ఇక్కడ దిగవలసినది. మిమ్మల్ని చూడాలని వుంది.

అమ్మ, బాబాయ్ ఎంత చెప్పినా నాన్న


లల్లూరాం అండ్ కంపెనీ
(స్థాపితము 1928.)
ఎన్నో సంవత్సరాలుగా మన్నికకు, నాణ్యతకు, సరసమైన ధరలకు ప్రసిద్ధిచెందిన
* ఇనుప పెట్టెలు * ఉక్కుబీరువాలు
* క్యాషు బాక్సులు
లల్లూరాం అండ్ కో,
వెలగలేటివారి వీధి, :: విజయవాడ - 1.
క్రొత్త పోస్టాఫీసు - మారుతి సినిమా ఎదురుగా.



మహేంవారి 'శ్రీ గౌరీమాహాత్మ్యం'లో సూర్యకళ, శ్రీరంజని, రామారావు.

# మరో మంచి ఫ్రెంచి చిత్రం

ఈమధ్య మరో మంచి ఫ్రెంచి చిత్రం చూసే అవకాశం మద్రాసువాసులకు కలిగింది. "రెస్పెక్టబుల్ ప్రాస్టిట్యూట్" వచ్చి వెళ్లిన కొద్ది రోజులకే "వేజెస్ ఆఫ్ ఫియర్" (భయంకరీయు) అనే చిత్రం మిడ్‌లాండ్‌లో విడుదల అయింది. ఈ చిత్రానికి ప్రేక్షకులు బాగా వస్తున్నా వారంరోజులలోనే ఎత్తివేశారు. కారణం దురూహ్యం.

యూరోపియన్ చిత్రాలతో మనకి పరిచయం తక్కువ. ఆర్థికబలం, సంఖ్యాబలం, తారాబలం, చిత్రమైన రంగులు మొదలైన అనవసరపు హంగులతో దేశంలోకి జొరబడే హాలీవుడ్ చిత్రాలు చూసి చూసి మెదడు తెరముకట్టినవారికి నూటికి కోటికి వచ్చే ఈ యూరోపియన్ చిత్రాలు తప్పకుండా కొత్త అభిరుచి కలిగించగలవు. టెక్నిక్ చాటున, పైపై మెరుగుల చాటున యథార్థాన్ని కప్పిపుచ్చాలనే ప్రయత్నం వీటిలో కనబడదు.

"వేజెస్ ఆఫ్ ఫియర్" అనే చిత్రంలో నికృష్టజీవితం నుంచి పరిశుభ్రమైన జీవితంలోకి తప్పించుకుపోవాలనే బలీయమైన వాంఛతో ప్రాణాల్నీ, దుస్సాహసానికి ఒడిగట్టి, ధనం ఆర్జింపజూచే నలుగురు వ్యక్తుల స్వభావాల చిత్రణం కనిపిస్తుంది. ఏ క్షణంలోనైనా మృత్యువు ఎదురయ్యే పరిస్థితిలో మనిషి ఎలా ప్రవర్తిస్తాడు? మృత్యుసముఖంలో అందరూ సమానులే అయినా ఒక్కొక్క రొక్కొక్క విధంగా మృత్యువు నెదుర్కొంటారు. ఒకడు చచ్చిపోయేలోగా అనేకసార్లు 'చచ్చిపోయి' చివరికి చచ్చిపోతాడు. ఒకడు మరికి జీవితానికీ మరణానికీ తేడా లేని ఉపేక్షాభావంతో చచ్చిపోతాడు. మరొకడు చచ్చిపోవడమంటే అర్థంకానట్లు నవ్వుతూ, తుళ్లుతూ చచ్చిపోతాడు. మరొకడు జయిస్తే సుఖిస్తాం, లేకపోతే జీవితానికి 'గుడ్ బై' అనే మొండిధైర్యంతో ముందుకు సాగిపోతాడు. చివరి కతడు విజయంపొంది విజేతగానే మరణిస్తాడు. ఇలాగ ఈచిత్రంలో మానవుని వివిధముఖాలు కనిపిస్తాయి.

కథ ఇది! సెంట్రల్ అమెరికాలో ఎక్కడో ఒకచోట ఒక అమెరికన్ నూనె కంపెనీవారి నూనెగని అంటుకుంటుంది. ఆ గని ప్రేల్చివేస్తేగాని మంట ఆరికట్టడం సాధ్యం కాదు. గని ప్రేల్చడానికి కావలసిన ప్రేలుడు సామగ్రిని మూడువందల మైళ్ళ దూరంనుంచి తెప్పించాలి. గనివద్దకు

ప్రేలుడుసామగ్రితో నిండిన రెండు ట్రక్కులను తీసుకువెళ్ళినవారికి రెండు వేల డాలర్లు ఇస్తామని కంపెనీ అధికారులు ప్రకటిస్తారు. నలుగురు వ్యక్తులు సాహసించి ముందుకు వస్తారు. ఈ నలుగురూ ఆ ట్రక్కులను తీసుకుని అతి ప్రమాదభరితమైన దీర్ఘ ప్రయాణం సాగిస్తారు. దారిలో ముగ్గురు చనిపోతారు. ఒకడే గమ్యస్థానం చేరుకుంటాడు. అతడు బహుమానం తీసుకుని, ఆ ధనంతో సుఖజీవితం గడపవచ్చునని సంతోషంతో తిరిగి వస్తూ ప్రమాదానికి లోనై చనిపోతాడు. సుఖంగా, గౌరవప్రదమైన జీవితం గడపడమనేది అతనిలాంటివారికి ఉద్దేశింపబడినది కాదన్నట్లుగా అతన్ని విధికూడా మోసం చేస్తుంది.

హెచ్. జి. క్లూజో అనే ఫ్రెంచి దర్శకుడు డైరెక్టుచేసిన ఈ చిత్రం 1953 కాన్స్ చలనచిత్రోత్సవంలో ప్రథమ బహుమతి పొందింది. 



# సినిమా వార్తలు



శ్రీ వినాయకఫిలింస్ నిర్మిస్తున్న హాస్య చిత్రం "బలే బావ" వీనస్ స్టూడియోలో చురుకుగా తయారవుతోంది. రేలంగి, జానకి, జగ్గయ్య, గుమ్మడి, లక్ష్మీకాంత, చదలవాడ, నల్ల రామమూర్తి, బాబ్జీ, బాలకృష్ణ, పద్మనాభన్ ప్రభృతులు నటిస్తున్నారు. ఇప్పటికి రెండు పాటలను రికార్డుచేసి, చిత్రించారు. ఒక పెద్ద సెట్ పై పని పూర్తిఅయింది. ఈ చిత్రనిర్మాత శ్రీ టి. రంగయ్య. దర్శకుడు శ్రీ పబ్బవీస్ రజనీకాంత్. సంగీతం శ్రీ ఎస్. దక్షిణామూర్తి సమకూర్చుతున్నారు. కెమేరా శ్రీ సి. నాగేశ్వరరావు.

* * *

మణీ ప్రొడక్షన్స్‌వారి తమిళ చిత్రం 'మామన్ మగళ్' తెలుగు వ్యాఖ్యానంతో 'బావా మరదలు' పేరిట మే 19న ఆంధ్రలో విడుదల అయింది. ఆచార్య ఆత్రేయ వ్యాఖ్యానం వ్రాశారు. సావిత్రి, ఆర్. గణేశన్, దొరైరాజ్, బాలయ్య మొదలగువారు నటించారు. దర్శకుడు శ్రీ ఆర్. ఎస్. మణి.

* * *

'టౌన్‌బస్' అనే తమిళ చిత్రాన్ని జైరాం ప్రొడక్షన్స్‌వారు తెలుగులోకి 'డబ్' చేయబూనుకొన్నారు. ఈ చిత్రం తమిళనాడులో విజయవంతంగా నడిచింది. అంజలీదేవి ఇందులో కొత్త తరహా భూమిక నిర్వహించింది.

తెలుగు చిత్రానికి మాటలు ముద్దుకృష్ణ, పాటలు శైరంగి, వ్రాస్తున్నారు. సంగీతం రంగారావు. దర్శకుడు జగన్నాథ్ నిర్వహణ కె. ఆర్. రెడ్డి

విశ్వభారతి ఫిలింస్‌వారి 'బసంత్ బహార్'లో నిమ్మి, భరత్ భూషణ్.



శంకర్ ప్రొడక్షన్సువారి 'సదారమ'లో ఊహాసుందరి పొందుకోసం నూలు నిచ్చెనమీద ఏ లోకాలను చేరడానికో యత్నిస్తున్న ముసుగు దొంగ 'నాగేశ్వరరావు'.

# సినిమా వార్తలు

జి. వి. ఎస్. ప్రొడక్షన్స్‌వారి 'శాంత' మే 23 న ఆంధ్రలో విడుదల అయింది. రామారావు, రాజసులోచన, జానకి ప్రభృతులు నటించిన ఈ చిత్రానికి శ్రీ ఇ. ఎస్. ఎన్. మూర్తి దర్శకుడు. నిర్మాత శ్రీ సదాశివుడు. సంగీతం ఘంటసాల.

* * *

నాగేశ్వరరావు, అంజలి, రేలంగి, కృష్ణకుమారి మొదలగువారితో లక్ష్మీప్రొడక్షన్స్ నిర్మిస్తున్న 'ఇలవేల్పు' దాదాపు పూర్తి అయినట్టే ఈ నెలలోనే విడుదల అవుతుంది. దీనికి దర్శకుడు శ్రీ యోగానంద్.

* * *

ఎ. వి. ఎం. వారు నిర్మిస్తున్న హిందీ చిత్రం "చోరీ చోరీ" పూర్తికావస్తున్నది. అనంత్ ఠాకూర్ దర్శకత్వాన ఇక్కడ తయారవుతున్న ఈ చిత్రంలో నర్గీస్, రాజ్‌కపూర్, డేవిడ్, ప్రాణ్, రాజ్ మెహ్రా, రాజసులోచన, అమీర్ ఖాను, హాస్యనటులు గోప్, భగ్‌వాన్, ముక్రీ, జానీవాకర్‌లు ప్రముఖపాత్రలు నిర్వహిస్తున్నారు. హాస్యరసప్రధానమైన ఒక ఉక్కానికథను శ్రీ అనంతఠాకూర్ రక్తికరంగా చిత్రించినట్లు తెలుస్తోంది.

ఏ. వి. ఎం. నిర్మించిన మరో హిందీ చిత్రం "భాయీ భాయీ" ఈనెల 11 న విడుదలయింది. అశోక్‌కుమార్, కిశోర్ కుమార్, నిమ్మీ, నిరూపరాయ్ ఇందులో నటించారు. దర్శకుడు ఎం. వి. రామన్.

* * *

హిందీ మార్కెట్‌లో ధాటీగా ప్రవేశిస్తున్న మరొక మద్రాసు సంస "వరసూ". గ్యాన ముఖర్జీ దర్శకత్వాన వీరు "సితారోంసే ఆగే" అనే హిందీ చిత్రాన్ని అశోక్‌కుమార్, వైజయంతిమాల, జానీవాకర్, జగ్‌దీప్‌సేథీ ప్రభృతి తారాగణంతో నిర్మిస్తున్నారు. శచిన్‌భౌమిక్ దీనికి కథ వ్రాశారు. దర్శకుడు గ్యాన్ ముఖర్జీయే స్క్రీన్‌ప్లే రూపొందించారు. ఛాయాగ్రహణం కె. హెచ్. కపాడియా. సంగీతం శచిన్‌దేవ్ బర్మన్.

* * *

జూపిటర్ పిక్చర్స్‌వారి హిందీ చిత్రం "నయా ఆద్మీ" బాగానే పోతున్నట్లు తెలుస్తోంది. 'పెణ్ణరసి'(?) అనే తమిళ చిత్రం కథ ఆధారంగా వీరు ఈ చిత్రం నిర్మించడం తెలిసినదే. దీనికి తెలుగు 'వర్షన్' 'సంతోషం' ఆంధ్రలో ఇదివరకే విడుదల అయింది. "నయా ఆద్మీ"లో అంజలి, రామారావు, జమున, అన్వర్ హుసేన్, గోప్, మొదలగువారు నటించారు. దర్శకుడు సి. పి. దీక్షిత్.

* * *

అంజలీ పిక్చర్స్ నిర్మిస్తున్న జానపద చిత్రానికి శ్రీ వేదాంతం రాఘవయ్య దర్శ



సదక్ ప్రొడక్షన్స్‌వారి 'ఛూ. మంతర్'లో అమితాగుహ, జానీవాకర్.

ట్వంటీయత్ సెంచరీఫాక్స్ సంస్థ సినిమాస్కోప్‌లో ౫౫ మిల్లిమీటర్లలో నిర్మిస్తున్న చిత్రం "కింగ్ అండ్ ఐ"లో సయాం ప్రభువుగా యూల్ బ్రెనర్, ఆయన పిల్లలకు చదువు చెప్పవచ్చిన దొరసాని పంతులమ్మగా డెబొరాకెర్. ఈ కొత్త పద్ధతిలో వీరు నిర్మిస్తున్న మరో చిత్రం పేరు 'కెరసెల్'. మామూలు ౩౫ మిల్లిమీటర్ల చిత్రానికి నాలుగురెట్లు పెద్దబొమ్మను ఈ పద్ధతిద్వారా తెర కెక్కించవచ్చు.

# 8 విదేశ చిత్రాలపై నిషేధం

## భారతప్రభుత్వ నిర్ణయం

మన మిత్రదేశాలకు సంబంధించిన చిత్రాలను ఇక్కడ ప్రదర్శించినపుడు, ఆయా చిత్రాలు, ఆ దేశప్రజల జీవన విధానాలను సవ్యంగా సక్రమంగా చిత్రించని పక్షంలో వాటిని నిషేధించాలని భారతప్రభుత్వం నిశ్చయించుకొన్నారు. ఈ విధానం మేరకు, ఆఫ్రికన్ ప్రజలను చూపే 8 విదేశీయ చిత్రాలను (రెండు బ్రిటిష్, ఆరు అమెరికన్) నిషేధిస్తూ కేంద్రప్రభుత్వ గెజెట్‌లో అధికారప్రకటన చేశారు.

ఈ చిత్రాలు లోగడ మనదేశంలో ప్రదర్శించబడ్డవే. వీటిలోను, ఈ తరహాకు చెందిన ఇతర చిత్రాలలోనూ, కంకిటి నదులుగా, గుండె చెదరేలా అద్భుతదృశ్యాలు చూపించి, జనాన్ని ఆకర్షించేనిమిత్తం, కేవలం 'స్పెక్టకిల్' పేరిట ఆఫ్రికన్ ప్రజలను పరమ అనాగరికులుగా, హింసాప్రవృత్తి కలవారుగా, చూపించడం జరిగింది. వాళ్ల తీరుతెన్నులూ, ఆచార వ్యవహారాలూ, వేషభాషలూ మొదలైనవన్నీ కూడా, 'సాహసో పేతులైన' శ్వేతజాతుల వారు అడవులలో సాగించే అద్భుత సాహసకార్యాలకు, హంగుదారులుగా ఉండేటట్టు రీతిలోనే తీర్చిదిద్దారు తప్ప ఆఫ్రికన్ ప్రజల ప్రకృతిని, వారి సంస్కృతిని సవ్యంగా చూపడం జరగలేదు. అది ఆ దేశీయులకు బాధాకరంగా ఉంటుంది. వారు మనకి మిత్రులు కాబట్టి, మనదేశంలో ఈ తరహా చిత్రాలు చూపడం, చూడడం వాంఛనీయం కాదు. హర్షించగల పనికాదు. ఈ దృష్ట్యానే కేంద్ర సెన్సార్ సంఘం ఈ విధానం అవలంబించారు.

కర్తవ్యం నిర్వహిస్తున్నారు. అంజలి, నాగేశ్వరరావు ఇందులో నాయకీ నాయకులు. వీనస్ స్టుడియోలో ఈ చిత్రం చురుకుగా తయారవుతోంది.

* * *

శరత్ నవల "బిందుగా రబ్బాయి" ఆధారంగా అనుపమ ఫిలింస్ నిర్మిస్తున్న చిత్రం కూడా వీనస్‌లోనే తయారవుతోంది. దీనికి శ్రీ తిలక్ దర్శకుడు. జమున, సూర్యకాంతం, నాగయ్య, జగ్గయ్య, రమణారెడ్డి, కుటుంబరావు, మాస్టర్ వెంకటేశ్వర్ నటిస్తున్నారు. మాటలూ పాటలూ శ్రీ తాపీ ధర్మారావు, ఆత్రేయ.



మన దేశంలోను, ఇతర ఆసియా దేశాలలోను విరివిగా సోవియట్ చిత్రాలను ప్రదర్శించడానికి పెద్ద నగరాలలోను బస్తీలలోనూ థియేటర్లను అందుబాటులో ఉండే ఏర్పాట్లు చేసుకోవాలని సోవియట్ రష్యా ఆలోచిస్తున్నట్లు తెలుస్తోంది. అందుబాటులో ఉండడం అంటే, వారు ఇక్కడ సినిమా హాలులను కౌలుకి తీసుకుంటారో, ఇతర పద్ధతులు అనుసరిస్తారో స్పష్టంగా తెలియరాలేదు. కౌలుకి తీసుకోవడం మాత్రం కలిసివచ్చే పద్ధతి కాదు. ఎందుకంటే అమెరికా బొంబాయిలో ఒక థియేటర్‌ను ఇలాగే తీసుకోవడం, దానికి అవసరమైన చిత్రాలు సరఫరా చేయలేకపోవడం జరిగింది. దరిమిలా అది విరమించుకున్నారు.

నిజానికి, విదేశ చిత్రాలను ఇక్కడ బహుళజనాదరణకు పాత్రం చెయ్యాలంటే ప్రధాన నగరాలన్నిటిలోనూ, చలనచిత్రకళను ప్రోత్సహించడం లక్ష్యంగా చిన్న చిన్న థియేటర్లు నిర్మించడం మంచిది. ఏ మూడు నాలుగు వందలమందికో స్థలం ఉండే విధంగా వీటిని నిర్మిస్తే, ఒక్క రష్యావే కాదు, జెకోస్లావాకియా, హంగరీ, ఇటలీ, ఫ్రాన్సు, జపాన్, ప్రభృతదేశాల చిత్రాలనుకూడా ఇక్కడ గిట్టుబాటు అయేవిధంగా ప్రదర్శించుకో వచ్చును. ఇటువంటివి ఆరంభంలో బొంబాయి, ఢిల్లీ, కలకత్తా మద్రాసు ప్రభృతి ప్రముఖనగరాలలో నెలకొల్పి, క్రమక్రమంగా దేశవ్యాప్తంగా పట్టణాలలోను బస్తీలలోను నిర్మించవచ్చును.

## 8 విదేశ చిత్రాలపై నిషేధం

ఇప్పుడు నిషేధింపబడ్డ చిత్రాలు:

బ్రిటన్‌కు చెందిన జె. ఆర్థర్ రాంక్ కంపెనీవారి 'ఆఫ్రికన్ క్వీన్' 'వెస్ట్ ఆఫ్ జాంజిబార్'.

అమెరికాకు చెందిన, ట్వెంటీయత్ సెంచరీ ఫాక్స్‌వారి "స్నోస్ ఆఫ్ కిలిమాంజరో", 'అన్‌టేమ్‌డ్', ఆర్. కె. ఓ. రేడియోవారి 'బిలో ది సహారా' 'ఆఫ్రికా అడ్వెంచర్', మెట్రో గోల్డ్‌విన్ మేయర్ వారి 'మొగాంబో', యూనివర్సల్ ఇంటర్నేషనల్ వారి 'టాంగనీకా' ఈ చిత్రాలు, వీటికి సంబంధించిన 'ట్రయిలర్'లూ కూడా నిషేధించారు. ★

అమెరికాలో ఇవి చాలా ఆడాయి బహుళ జనాదరణ పొందాయి వీటిద్వారానే ఆ దేశంలో ఇటలీ, ఫ్రెంచి చిత్రాలకు మంచి ప్రదర్శనావకాశాలు లభించాయి. నిజానికి అమెరికాలో విదేశీయ చిత్రాలకు చోటు దొరికేది వీటిలోనే. పెద్ద థియేటర్లలో ప్రవేశం బహు అరుదు. మనదేశంలో అలాంటి వేదికలు లేవు. ఏ చిత్రం అయినా సరే బాగుంటే, నలుగురికీ నచ్చేటట్లయితే అన్ని థియేటర్లలోనూ విడుదల అవుతుంది అయితే, వీటికి కట్టవలసిన అద్దె చాలా ఎక్కువ అయినందువల్ల, దేశజనాభాలో అత్యధిక సంఖ్యాకులకు తెలియని భాషలో తీసిన చిత్రాలను వీటిలో విడుదలచేస్తే అద్దెడబ్బులు కూడా గిట్టకపోవచ్చు. ప్రపంచ విఖ్యాతినందిన "బైసికిల్ థీవ్స్" "వేజెస్ ఆఫ్ ఫియర్" వంటి కళాఖండాలే వ్యాపారరీత్యా లాభసాటి కాలేకపోయాయి అందువల్ల ఈ తరహా చిత్రాలను దేశంలో కొందరికైనా చూపించి, క్రమంగా బహుళజనాదరణకు పాత్రం చేయడానికి వీలుకలగాలంటే దేశవ్యాప్తంగా తక్కువ అద్దెకు లభించే చిన్న థియేటర్లు నిర్మించడం అవసరం. ఇందుకు మన ప్రభుత్వం, విదేశాలవారుకూడా పూనుకోవచ్చు. అటువంటివాటిలో ఒక విదేశీ చిత్రాలే కాక, ప్రాంతీయభాషలలో తయారయే పథేర్ పాంచాలీవంటి ఉత్తమ చిత్రాలనుకూడా ప్రదర్శించవచ్చును. పథేర్ పాంచాలీవంటి చిత్రానికి ఢిల్లీ బొంబాయి నగరాలలో ఉదయపువేళ ప్రదర్శనాలకు మాత్రమే అవకాశం దొరికింది!

మనదేశంలో, ఇకనైనా ఏడాది పొడుగునా విభిన్న దేశాల చలనచిత్రోత్సవాలను సాధ్యమైనంత తరచుగా ఏర్పాటు చెయ్యాలి. జపాన్ చలనచిత్రోత్సవం జరుపడానికి ప్రయత్నాలు జరుగుతున్నట్లు తెలిసింది. అలాగే మిగతా దేశాలకు కూడా ఏర్పాటు చేస్తే, దేశదేశాల మధ్య సాంస్కృతిక సంబంధాలు పెంపొందడానికి దోహదం జరుగుతుంది. అది అలాఉంచగా, హాలీవుడ్ నించి దిగుమతిఅయే క్రైమ్ చిత్రాలు, సెక్స చిత్రాలు చూసిలేక విసుగెత్తిన జనానికి ప్రాణం లేచివస్తుంది. అందువల్ల, ఈ విషయమై విభిన్నదేశాలతోపాటు, మనదేశ ప్రభుత్వ సమాచారశాఖ కూడా శ్రద్ధవహించడం వాంఛనీయం; అవసరం.

* * *



దత్తాధర్మాధికారి నిర్మించిన 'సుదర్శన్ చక్ర'లో సాహూ మోదక్.

భారత ప్రభుత్వం పనుపున బిమల్ రాయ్ ప్రొడక్షన్స్ నిర్మిస్తున్న బౌద్ధచిత్రంలో ప్రపంచ విఖ్యాతినందిన వర్ణచిత్రాలు, శిల్పాలూ, శాసనాలూ 15 వందల పైచిలుకు చూచే అవకాశం కలుగబోతున్నది. 9 వేల అడుగుల నిడివిగల ఈచిత్రంలో నటీనటులు ఎవరూ లేరు. ఆసియా దేశాలపై బౌద్ధమత ప్రభావాన్ని, తద్వారా సాంస్కృతిక సంబంధాలు పెంపొందడానికి శిల్పచిత్రకళలు వర్ధిల్లడానికి జరిగిన దోహదాన్ని ఇందులో సమగ్రంగా చిత్రిస్తున్నారు. ఈ చిత్రం దర్శకుడు శ్రీ రాజ్‌బంశ్ ఖన్నా, తమ బృందంతో గత ఆరు నెలలలోనూ, సింహళం, కాంబోడియా టిబెట్, మధ్యఆసియా, చైనా, జపాన్, ఇండోనీషియా దేశాలలోను పర్యటించి అక్కడి శిల్ప కళాఖండాలను సెల్యులాయిడ్ మీదకు ఎక్కించారు. మనదేశంలో అజంతా ఎల్లోరా గుహలు, అమరావతి, నాగార్జునకొండ, గోలి, సాంచి, సారనాథ్, మధుర ప్రభృతి కేంద్రాలలోని బౌద్ధ కళాఖండాలను ఈ రూపేణా వెండి తెరకు ఎక్కించారు. వీటన్నిటినీ వివరిస్తూ, వాటి చరిత్రను తెలుపుతూ చిత్రంపొడుగునా వ్యాఖ్యానం ఉంటుంది. ఈ విషయంలో దేశంలోని ప్రముఖ బౌద్ధాచార్యుల సహాయాన్ని అర్థించి స్వీకరించినట్లు దర్శకుడు శ్రీ ఖన్నా తెలియచేశారు.

* * *

15 ఏళ్ళనాడు కిదార్‌శర్మ నిర్మించిన 'చిత్రలేఖ' చిత్రాన్ని ఇప్పుడు ఆయన

(56-వ పేజీ చూడండి)

ఆ కాలంలో అమ్మన్న గారంటే ఆ ఊళ్లో ఎరుగనివా ళ్లుండేవారు కాదు. స్త్రీ జన్మ ఎత్తకుండా-ఏ ఇంగ్లాండులోనో పుట్టుంటే అంతర్జాతీయఖ్యాతి ఆర్జించవలసిన అఖండమైన బుర్ర అమ్మన్న గారిది.

ఆవిడ ఆంధ్రదేశంలో పుట్టింది. అందుకనే అంతర్జాతీయఖ్యాతి ఆమెకు అంటలేకపోయింది. ఆవిడకు ఎనిమిదో ఏట పెళ్లి చేసారు. పదకొండో ఏట కాపురాని కొచ్చిందిట.

అమ్మన్న గారికిప్పుడు తొంభైఎనిమిదేళ్లు. ఈ కాలపు మనిషి కాకపోవటంవల్లనూ, ఆ కాలపు అలవాట్లు గలదవటంవల్లనూ - ఆమె ఇంకా దృఢంగానే ఉంది. ఆమె గొంతులో గాంభీర్యం తగ్గలేదు. ముఖం కొంత ముడతలు పడింది.

‘రామకృష్ణ’

సింహాద్రి తాతయ్య యిచ్చిన పచ్చ అద్దాల కళ్ళజోడు పెట్టుకుంటుంది.

ఆమెకు కళ్ళంతగా కనిపించవు. అయినా చెవులు పాముచెవులకంటె సున్నితంగా ఉంటాయి.

అమ్మన్న గారు పదకొండో ఏట కాపురానికి రావటంతోటే యింటి సంబంధమైన అధికారాలన్నీ స్వీకరించింది. అరిటేరిన యిల్లాలికంటె, అధికంగా, ఆ చిన్న వయస్సులో ఆ జమిందారీఘాయాలో నడిచే కుటుంబాన్నీ అమ్మన్న గారు నిర్వహించటం చూసి అందరూ ముక్కుమీద వేలేసుకునే వారట.

అమ్మన్న గారు ప్రపంచంలో ఎవరికీ, ఏ సందర్భంలోనూ జడిసేఘటం కాదు. ఆ మాటకొస్తే ఆ వీథి వీథీ, అమ్మన్న గారిపేరు చెపితే శత్రులు నీరు త్రాగేవి కావు.

అమ్మన్న గారు ఆరోజుల్లోకూడా ఏమంత అందంగా ఉండేది కాదుట. ఆ మాటకొస్తే ఆమె భర్త అయ్యల్లు గారుకూడా అందగాడు కానేకాదు.

అందుకనే వారి దాంపత్యంలో ఆవిషయమై లోటు రాలేదు.

అందరి యువతుల్లాగానే, కాపురాని కొచ్చిన కొత్తల్లో అమ్మన్న గారుకూడా భర్తను అదుపులో పెట్టాలని ఎంతో ప్రయత్నం చేసిందట.

కాని అయ్యల్లుగారు అలాటివాడు కాదు. అందుకనే అమ్మన్న గారికీ అయ్యల్ల గారికీ అనేక చిల్లరమల్లర యుద్ధాలు జరిగేవిట.

ప్రపంచంలో మరే వ్యక్తికీ తలవంచని అమ్మన్న గారు అయ్యల్ల గారికి తల వంచక తప్పలేదు.

క్రమంగా అమ్మన్న గారికి ఇద్దరు మొగ పిల్లలూ ఒక ఆడపిల్లా కల్గారు. ఆడపిల్లకు నలుగురైన సంబంధం చూసి, అతి ఘనంగా పెళ్ళి చేసింది అమ్మన్న గారు. అయిదు రోజులు పెళ్ళి చేసింది. ఆ ఊరంతా వంటి కేసింది. పూలపల్లకీ తెప్పించింది. వైభవోపేతంగా అనుకున్న దానికంటె, అధికంగా లాంఛనాలు ముట్టచెప్పి అతి ముచ్చటగా పెళ్లి చేసింది. పెళ్ళికి బంధువులంతా వచ్చారు.

మెరయుచు పొంగే పానీయము
వేసవికాలములో కలిగే
కడుపులోని అస్వస్థతలను
పోగొట్టును

వేసవికాలములో మీ కడుపులో సులభముగ అస్వస్థత కలుగును. మెరయుచు పొంగే గ్లాసెడు చల్లని ఈనో కడుపును పరిచేసి, జీర్ణకోశము చురుకుగా ఆరోగ్యవంతముగా ఉండేలా క్రమపరచును. ఈనో సౌమ్యముగ, సమర్థతతో ఆమ్లాధిక్యత వలన కలిగే అజీర్ణము, గుండెమంట మరియు కడుపు ఉబ్బరములకు సత్వరముగ విశ్వాసమైన ఉపశమనము కలిగించును. దానిని పరకడుపున కొంచెము పెద్ద మోతాదు లాగుకే సౌమ్యవిరేచనకారిగా పనిచేయును.

ఎంతో చల్లగా మరియు
ఆహ్లాదకరముగా ఉండును!

ఈనోస్
‘ఫ్రూట్ సాల్ట్’

ENO

‘ఈనో’ మరియు ‘ఫ్రూట్ సాల్ట్’ అను మాటలు
రిజిస్టరు చేయబడిన ట్రేడు మార్కులు.

ENO. 1799 (Tel.)

# ★ అమ్మన్నగారు ★

వచ్చిన ప్రతి ఒక్కరికీ - అమ్మన్నగారు తనకున్న ఏడువారాల నగలూ చూపించేది. ఆమెకు వడ్డాణంలాంటి పెద్ద వస్తువులుకూడా రెండేసి ఉండేవి. భర్తని ఈ విషయంలో బాగానే సాధించింది అమ్మన్నగారు.

ఆ ఊరి మగవాళ్లలో అయ్యల్లగారికి ఎంతో గౌరవం ఉండేది. ఆడవాళ్లలో అంతకంటె అధిక పేరుప్రఖ్యాతులు గడించింది అమ్మన్నగారు.

అమ్మన్నగారికున్నన్ని నగలు ఆ ఊళ్లో ఎవరికీ లేవు. ఆవిడ కాపురానికొచ్చేసరికి వంటిమీద వీసమెత్తు బంగారంలేదు. అయినా అన్ని నగలు అమర్చుకుంది. ప్రతి నగకీ కనీసం పక్షంరోజులు ఉపవాసాలు చేయటం—శాంతియుతంగా భర్తతో పోరు సల్పటం—విషయాంతరం.

ఏమైనా వందెడు నగలు అమిరాయి. అందుకే అమ్మన్నగార్ని అతిసమర్థురాలుగా లోకం గుర్తించింది.

పెద్దకొడుక్కి కూడా ఓ మంచిసంబంధం చూసి పెళ్లి చేసింది. ఆపిల్ల కోతిలాగా ఉంటుందంటారు గిట్టనివాళ్లు. అయినా పెద్దకొడుకు తల్లి గీచిన గీటు దాటేవాడు కాడు కాబట్టి పెళ్లికి ఒప్పేసుకున్నాడు. ఆ అమ్మాయి వాళ్లకు ఒక్కతే కూతురు. అరవై ఎకరాల సుక్షేత్రమయిన మాగాణీ ఉంది. ఆ సంగతి అమ్మన్నగారికి తెలుసు.

ఏమైనా అమ్మన్నగారు సమర్థురాలు. ఎప్పుడూ ఆమె దగ్గర వేలకువేలు డబ్బుండేది. సగం భర్తకు తెల్సినడబ్బు. సగం ఆవిడ దాచుకున్న ధనం.

అయ్యల్లుగారికి పెద్ద మామిడితోట ఉంది. ఆ తోటలో సపోటా చెట్లుకూడా ఉన్నాయి. ఆ తోటమీదకూడా అమ్మన్నగారే అజమాయిషీ చేసేది.

అయ్యల్లుగారు ఠాణేదారీ ఉద్యోగం. రెండుచేతులా సంపాదించేవాడు.

అయ్యల్లుగారింట్లో రోజూ ఇరవైమంది అతిథులు భోంచేసేవారు. అందరికీ వండి వార్చేది అమ్మన్నగారు. అయిదారు ఆధరువులు రోజూ ఉండేవి. రెండు మూడు పిండివంటలు రోజూ చేసేది.

అంత ఘనంగా బ్రతికింది అమ్మన్నగారు. ఒకళ్లు తింటున్నారని చింతలేదు అమ్మన్నగారికి. ప్రతిష్ఠకోసం మాత్రం పడిచస్తుంది.

అమ్మన్నగారు గుండెనిబ్బరంగల మనిషి. ఆమెకు కష్టాలు భయంకరంగా ఉండవు. సుఖాలు ఉప్పొంగించవు. నిండుకుండలా నిశ్చింతగా ఉండేది అమ్మన్నగారు. ప్రతి పేరంటంలోనూ ఆవిడే కీలకవ్యక్తి. ప్రతిసారీ ఆమెకే మొదట పసుపు రాసేది.

అంత హుందాతనముంది అమ్మన్నగారిలో. అమ్మన్నగారు పొట్టిగా వుంటుంది. కొట్టొచ్చేలా కానీకాసంత కుంకుం పెడుతుంది. వంకీలవడ్డాణం పెడుతుంది. జబ్బలకు దవ్వలవంకీలున్నాయి. వందెడు నగలతో వెలుగుతూ ఉండేది.

అందుకే అందరికీ అంత ఇది అమ్మన్నగారంటే. అమ్మన్నగారి పెద్దకొడుకు చచ్చిపోయినా, అమ్మన్నగారు గుండెనిబ్బరం కోల్పోలేదు. అయ్యల్లుగారిని ఆవిడే ఓదార్చింది.

ఆ తర్వాత దావాల్లో-అప్పుల్లో అయ్యల్లుగారికి వారంటు వచ్చినా-అమ్మన్నగారి గుండెనిబ్బరం సడలిపోలేదు.

ఆస్తులన్నీ నడిబజారులో వేలం వేశారు. అగ్రహారం చేతులుదాటిపోయింది.

అయినా అమ్మన్నగారి గుండె నిబ్బరంగానే ఉంది.

ఆ మామిడితోట వేలం వేస్తున్నప్పుడు మాత్రం అంత గుండెనిబ్బరంగల అమ్మన్నగారు కంట తడిపెట్టింది.

తన చేతులలో పెంచింది మామిడితోట. తీరుబడి అయినప్పుడల్లా పాలేరు గురవయ్య బండి కట్టించుకుని - మామిడితోటకు వెళ్ళేది అమ్మన్నగారు. ఆ తోటమధ్యలో కూర్చుని సగర్వంగా ఈ తోటంతా నాదేనని సంబరపడేది, లోలోపల అమ్మన్నగారు. ఆ బంగినపల్లి మామిడిచెట్టు అంటు తన చేతుల్తో వేసింది. తోట ఆదాయం రెట్టింపు చేసింది అమ్మన్నగారు.

ఆ తోట వేలం వేస్తున్నప్పుడు అమ్మన్నగారి గుండెనిబ్బరం సడలిపోయింది. అందుకనే ఆమె కళ్ళల్లో నీళ్ళు తొంగిచూశాయి.

అయినా సంబాళించుకుంది అమ్మన్నగారు. కాని మరో దెబ్బ తగిలింది.

అయ్యల్లుగారు అకస్మాత్తుగా కన్నుమూశాడు. ఆధరువు ఏమీ లేకుండాపోయినది. అందుకనే బేలయిపోయింది అమ్మన్నగారు.

నగలన్నీ అమ్మింది. దాచిన డబ్బు తీసింది. పదెకరాల మాగాణీ కొంది. తన పేర పెట్టుకుంది.

రెండోకొడుకు పెళ్లి చేసింది. అది అంత వైభవంగా జరగలేదు. అయినా పరిస్థితులు అంతకంటె పెగలనివ్వలేదు.

అమ్మన్నగారి రెండోకొడుకు రామారావు వ్యాపారం చేస్తానన్నాడు.

పెట్టుబడి ఏదీ అంది అమ్మన్నగారు.

పొలమమ్మమన్నాడు రామారావు. అమ్మన్నగారు ఒద్దంది. రామారావు పట్టుపట్టాడు.

రామారావు సబ్బులఫ్యాక్టరీ పెట్టాడు. నష్టమొచ్చింది. సినిమాహాలు పెట్టాడు. నష్టమొచ్చింది. అప్పులు తీర్చటంకోసం మిగిలినదంతా అమ్మించాడు రామారావు.

అమ్మన్నగారు చేసేదిలేక అంతా రాసిచ్చింది. "నా తండ్రిడబ్బు—నీ పుట్టింటిది కాదు—" అన్నాడు రామారావు. ఆ మాట అబద్ధంకాదని అమ్మన్నగారికి తెలుసు. అందుకనే రాసిచ్చింది.

అమ్మన్నగారి కళ్ళముందు గోళీలాడిన గోవర్ధనరావు కలెక్టరీ చేస్తున్నాడు. కాశీశ్వరరావు ఫ్యాక్టరీ పెట్టాడు. సీతయ్య పంచాయతీబోర్డు ప్రెసిడెంట్ అయ్యాడు. మహేశ్వర్లు ఎమ్. ఎల్. ఏ. అయ్యాడు.


మీ బిడ్డ....

1, 3 సంవత్సరముల మధ్య, బాలాహారులైన మగ బిడ్డలలో, లివర్ వ్యాధులు సామాన్యమని, మా లెక్కలవల్ల తెలుచున్నది.

తరుచుగ అజీర్ణ వ్యాధులు, కడుపు ఉబ్బరము, చికాకు పడుట, కోపము, ఆకలి మందగించుట మొదలైన గుణములు లివర్ వ్యాధిని సూచించు లక్షణములు.




జమ్మి్స్
# లివర్‌క్యూర్
జమ్మి వెంకటరమణయ్య & సన్స్
జమ్మి బిల్డింగ్స్, మైలాపూర్, మద్రాసు-4.

ఇప్పుడు అమ్మన్న గారు పెద్దదైపోయింది. తెంతైవిరిమిళేళ్ళు నిండిపోయాయి.

రామారావు ఏదో చిన్న ఉద్యోగం చేస్తున్నాడు. అమ్మన్న గారు వీధి అరుగు మీద పచ్చద్దాల కళ్ళజోడు పెట్టుకుని కళ్ళుమూసుకుని కూచుంటుంది.

ఊరికే నే కూర్చుంటే ఏ బాధా లేదు.

ఆమెది స్తబ్దంగా ఉండే స్వభావం కాదు.

"ఆ మహేశ్వర్లుని ఓ సారి ఇలా పిలు-" అంటుంది.

ఆ గోవర్ధనరావున్నాడే, వాడిని ఈ చేతుల్తో పెంచా-మొన్న వచ్చి చూడకుండాపోయాడు-మళ్ళీ వచ్చాడుట. ఇలా పిలు-" అంటుంది.

ప్యాక్టరీకట్టెలతులుగడిస్తూ చిన్న కార్లలో తిరుగుతున్న కామేశ్వర్రావుతో.-

"మీ అమ్మ ఎప్పుడూ తప్పటి కానా అంటూ వచ్చేది నా దగ్గరకు. వాడికు పెట్టేదాన్ని. ఇలా ఉన్నామూ—ఓ తల్లీ పిల్లల్లా ఉన్నాం-"-అనేది అమ్మన్న గారు.

ఆ మాటలో అవగింజంత అసత్యం లేదు. అయినా కామేశ్వర్రావు కనుబొమలు ముడుచుకు చేవి.

ఏమైతేనేం ఇప్పుడు అమ్మన్న గారంటే ఎవరికీ లెక్కలేదు.

ఆవిడ పెద్దదౌతున్న కొద్దీ — చాదంటే భయం ఎక్కువౌతూంది.

ఎవరొచ్చినా 'మళ్ళీ చూస్తానో లేదో' అని బావురుమంటూంది అమ్మన్న గారు.

ఆవిడకూ మనుమరాళ్ళకూ క్షణం పడదు. దానికి కారణం ఆవిడలో ఓ భావం గూడు కట్టుకుంది.

తనని అందరూ నిర్లక్ష్యం చేస్తున్నారని అందుకే మనుమరాళ్ళతో ఎప్పుడూ కీచులాటేది.

ఎంత కీచులాడినా, వాళ్ళందరినీ తలో ఇంటివాళ్ళనీ చెయ్యాలని తొందరపడేది అమ్మన్న గారు.

అందుకనే కనిపించిన ప్రతి పుత్రాణ్ణి కులగోత్రాలూ - చదువు సంధ్యలూ - ఆస్తి పాస్తులూ-వివరాలు అడుగుతుంది అమ్మన్న గారు. అయినా ఎవరూ లెక్కచెయ్యటం లేదు అమ్మన్న గారిని.

"నా ఆస్తే నా కుంటే—ఈ లంజకొనలాక్కొక్కరికీ-అయిదేసిరోజులు పెళ్ళి చేసేదాన్ని కాదూ ?" అని స్వగతం చెప్పుకుంటో కాలక్షేపం చేస్తోంది అంటే అమ్మన్న గారు ఈ నాడు. ★


'అనాసిన్' లోని

నాలుగు మందులతో

మీ బాధా విముక్తిని పొందండి



'అనాసిన్' నాలుగు మందులయొక్క వైజ్ఞానిక మిశ్రమము అతి నరముల యొక్క స్థానములందు తీవ్రమైన మిశ్రమదర్శము అరిచి. నొప్పి. తలనొప్పి. జలుబులు. జ్వరం, వళ్ళు నొప్పి మరియు కండరాల నొప్పులనుండి శీఘ్రవిముక్తి కలిగించును

అనాసిన్‌లో ఇవి ఉన్నవి

1. క్వినైన్ : అధికశక్తివిరుద్ధ మరియు జ్వరనివారణ మొదట్ల గుణాలకు ప్రఖ్యాతి గాంచినది. జ్వరాన్ని తగ్గించడంలో మిక్కిలి శక్తిగలది.
2. కఫేన్ : బలహీనానికి మరియు దిక్కుతోచనందులకు తగిన కొనదగని విరివిగా వాడబడుతున్నది.
3. ఫినాసిటిన్ : తీవ్రమైన బాధా నివారణ జ్వరనివారణ యని ఖ్యాతిచెందినది.
4. అసిటైల్ శాలిసిలిక్ యాసిడ్ : తలనొప్పి. మరియు అలాటి బాధలను పోగొట్టుటకు ఉపయుక్తమైనది.

ఈ నాలుగు మందుల సరిగ్గా వైద్యునియొక్క ఉపదేశముగాను వరి పరిచేయును 'అనాసిన్' గుండెకు హాని కలిగించదు కడుపును అవకతవక చేయదు. నొప్పి. తల నొప్పి జలుబులు వళ్ళు నొప్పి మరియు కండరాల నొప్పులనుండి శీఘ్రంగా సురక్షితమైన మరియు దీర్ఘమైన విముక్తి కొరకు ఎల్లప్పుడూ 'అనాసిన్'నే వాడండి.




అనేకులాది మందికి బాధావిముక్తిని కలిగించును




# వరనిర్ణయము

౬౨

## ఇల్లిందల సరస్వతీదేవి

'కన్యా వరయతే రూపమ్, పితా శ్రుతమ్, మాతా విత్తమ్...' అని జనశ్రుతి.

వాస్తవముగా కన్య వరుడి రూపమొక్కటే కోరుతుందా? ఒక్క రూపమే కోరతగినదా? సాధారణముగా వివాహానికి పూర్వము జరిగే పెళ్ళిచూపులతంతు వరుడి రూపనిర్ణయానికై ఏర్పడ్డదేనా? — అంటే ఇంచుమించుగా వరుడి అందచందాలనుమాసి నిర్ణయించటానికే ఏర్పడ్డాయని అనవలసివస్తుంది. ఈ మాట, అనటానికి వీలులేకపోతే పెళ్ళిచూపులకని సమావేశమయిన ఆ పది నిమిషాలలో అంతకుపూర్వము పరిచయములేని వ్యక్తులు అంతకంటె ఎక్కువ ఏమి సాధించగలుగుతారు?

నిజానికి వరుడి రూపమొక్కటేనా వధువు కోరేది? అదొక్కటేనా కాంక్షింపతగినది? రూపముయొక్క ప్రభావము హృదయము మీద ఎంతపడుతుంది? ఈ ప్రశ్నలను ఎంత తర్కిస్తే అంత అయోమయమయి, అంతా మిథ్యగా తేలిపోయే ప్రమాదము ఉన్నది.

'సాధారణముగా స్త్రీలను కంటికి యింపుగా కనబడే పురుషులే ఆకర్షిస్తారు. సుగుణసంపదగల పురుషుడికి వస్త్రధారణ నాగరికముగా కంటికి ఇంపుగా ఉండకపోయినట్లయితే స్త్రీలచేత ఆకర్షింపబడడము కష్టం'మని హిలరీ ఎఫ్. వేజె "పర్సనాలిటీ అండ్ సక్సెస్" అనే గ్రంథములో వ్రాశాడు. ఈకాలపు స్త్రీలు 'పురుషులు ధరించిన వస్త్రాలు ముడతలు లేకుండా చక్కగా ఇస్త్రీచేయబడి ఉన్నాయా-లేదా? అతడి పాదరక్షలు శుభ్రముగా తుడవబడి తళతళ మెరుస్తున్నాయా లేదా?' వంటి అంశాల దృష్ట్యా టిప్‌టాప్‌గా వేషము ధరించిన పురుషుడికి సహజగుణసంపద ఉంటేతీరుతుందనే భావిస్తారని అతడి అంచనా. ఈ అంచనా స్త్రీల మనఃప్రవృత్తులను కొంత పరిశీలించి, కొంత ఊహించి చేయబడినదయి ఉండవచ్చు. విదేశీయులదయినా కావచ్చు.

మనదేశములో అనాదినుంచీ 'మగవాడికి అందమెందుకు?' అన్న ధోరణి ఎక్కువగా కనిపిస్తుంది. పురుషుడికి ప్రజ్ఞ, శౌర్యము, గాంభీర్యము, పరాక్రమము ఉండవలసిన లక్షణాలుగా భావింపబడ్డాయి. రాజకుమారైల స్వయంవరాలలో వధువువెంట చెలికత్తె పుష్పహారముతో వచ్చి, రాజసభలో ఆసీనులయిన వివిధదేశాధిపులనుగురించి వర్ణించి వారి శౌర్య పరాక్రమాలను స్తుతించటము మనకు చరిత్రవల్లనూ, ఇతర సాహిత్యమువల్లను తెలిసినదే. రాచకన్యలు రాజకుమారులను చూడకపోయినా వారి శౌర్యపరాక్రమాలను గురించి చెప్పగా విని హృదయార్పణ చేసేవారు. రుక్మిణి, దమయంతి, రాణీ సంయుక్త వరులను చూడకుండానే నిశ్చయించుకొన్నారు. సీతా ద్రౌపదివంటి వారికి వరనిర్ణయములో పరీక్షలు ఏర్పాటయినాయి. ఆ పరీక్షలలో నెగ్గినవారినే ఈ కన్యలు వరించారు.

ఆ కాలములోకూడా 'ఈ కన్యకు పుట్టినవాడు రాజ్యాధికారి కావాలి' అని కన్యలపక్షాన తండ్రులు వరులవద్దనుండి వాగ్దానాలు తీసుకొని పిల్లలను ఇచ్చేవారు. ఈ పద్ధతిలో వాగ్దానము చేయించుకొని జరిపించిన వివాహమే సత్యవతీశంతనులది. ఈ మధ్య కాలములోకూడా ధనప్రసక్తి స్త్రీల దృష్టిలో ఉన్నదనే నిర్ణయము. సాధారణముగా కన్యలకు ఆభరణాలమీద ప్రీతి ఎక్కువ; నగల నెక్కువగా పెట్టినట్లయితే వరుడి ఇతర లోపాలను కన్య అంతగా

పాటించదు' అని కవుల చిత్తవృత్తులను మన దేశములో అంచనా వేయటము జరిగింది. రూపహీనులు వయోవృద్ధులు 'కోరి నన్ని నగలు' పెట్టి వివాహాలు చేసుకుంటూ ఉంటారు, ఈ మార్గములో నడచిన కన్యలను.

మన దేశములో తల్లిదండ్రులు నిర్ణయించి చేసే వివాహాలలో కుటుంబ చరిత్రను గమనించడము ఉన్నది. వంశములో అందరూ శారీరకముగా, మానసికముగా 'మంచి ఆరోగ్యకరమైన పరిస్థితిలో ఉన్నరా లేదా' అన్న విచారణ జరిగేది. వంశములో ఎక్కడా దుర్వర్తనులు లేకుండా చూసేవారు. భార్యలను దండించటము, తిట్టటము ఆ వంశములో ఏ ఒక్కరు చేసినా ఇతరులపైన ఆ ప్రభావము ఇంతో అంతో పడుతుందని భావించేవారు. ఈ దృష్టితో వంశ యోగ్యతే కాకుండా వ్యక్తియోగ్యతను కూడా గమనించి, అంచనా వేసి నిర్ణయించేవారు. ఈ కాలములో కూడా స్వయంవరాలు కాక పెద్దలచే నిశ్చయము చేయబడిన వివాహాలలో వరనిర్ణయము ఈ దృష్టితో చేయబడుతుంది.

తల్లిదండ్రులు కాకుండా తమకు తామే స్వయంగా వరనిర్ణయము చేసుకోవలసి వచ్చిన సందర్భాలలో స్త్రీలు వరులను ఏ దృష్టితో ఎరుకుంటారు అంటే తాము చెప్పినట్లు వినే భర్తలు కావాలని కోరుకుంటారని నిశ్చయము చేయబడ్డది. తాము గీసిన గిరులు భర్తలు దాటకూడదు. ప్రతి చిన్న విషయములో ఒదిగి ఉండే భర్తలు కావాలని స్త్రీలు సామాన్యముగా వాంఛిస్తారు. తాము చెప్పినట్లుగా వస్త్రాలంకరణ చేసుకోవాలి; తాము చెప్పినట్లుగా నిర్ణయించినట్లుగా అన్ని పనులు, నిర్ణయాలు, అభిరుచులు కార్యక్రమాలు మార్చుకొనే పురుషులు భర్తలయితే సుఖపడుతామని కొందరు స్త్రీలు అభిప్రాయపడతారు.'

'తమ అలంకరణ విషయములో, తమ అభిరుచుల విషయములో సలహాలిచ్చే భర్తలు కావాలని కొంతమంది వాంఛిస్తారు. ఆ సలహాలు కూడా తమ అభిప్రాయాలకూ, మనోగతాలకూ అనుకూలమయినవీ అనుసరించినవీ అయిఉండాలిగాని ఏమాత్రము స్త్రీలచిత్తవృత్తులను గమనించకుండా, దేశకాల పరిస్థితులను గమనించకుండా చేసిన సలహాలు స్త్రీలకు నచ్చవు. స్వతంత్ర భావాలను భార్యలపైన రుద్దాలని చూసే భర్తలు కావాలని స్త్రీలు కోరుకోరు!

'కొందరు సతులకు పొగడ్తలు ప్రాణాధారము. ఎంతసేపూ వారి అలంకరణ, వారి తెలివి, అందము, సోయగము కనబడినప్పుడల్లా, వీలయినప్పుడల్లా మెనిమిటి స్తుతించుతూ ఉండాలి. వాటికే ప్రాముఖ్యము ఇవ్వాలి. సానుభూతి చూపించే భర్తలు కావాలని కొందరి కోరిక. ఈ సానుభూతి అవసరమయినప్పుడు చూపితే చాలదు. ప్రతి చిన్న విషయానికీ భార్యమీద సానుభూతి కనబరుస్తూ ఉండాలి. 'అయ్యో పాపం' అంటూ ఉండాలి. జబ్బు పడకపోయినా, అశక్తత లేకపోయినా, అవసరము లేకపోయినా జాలిపడుతూ ఉండాలి. ఈ దృష్టితో కనికరముగల మెనిమిటి కావాలని వాంఛిస్తారు చాలామంది స్త్రీలు.'

'తమకొరకు ఎంతధనమయినా నిర్లక్ష్యముగా వ్యయము చేయగల్గ పురుషుడు ముక్కువ కలవాడని స్త్రీల ఊహ. తమ సుఖముకొరకు ప్రీతికొరకు 'పురుషుడు


# చూడండి మెక్లీన్సు దంతాల్ని ఎంత చక్కగా శుభ్రపరుస్తుంది!

పరిష్కరించడానికి సాధ్యంకాని చాలకఠిన సమస్యను ఈ మూడు టీ కప్పులు నిరూపిస్తున్నవి. అవే పళ్లు అనుకోండి. వాని ముందుభాగాల్ని శుభ్రం చేయవచ్చు. వెనుక భాగాల్ని శుభ్రపరచవచ్చుకాని. ఆ పళ్ల మధ్యనున్న సందుల మాటేమిటి? అవి మామూలుపద్ధతిలో తోమటానికి అందేవి కావు. అత్యంత అపాయకరమైన విష క్రిములు అక్కడే దాగివుంటాయి. పళ్ల అందాన్ని చెక్కు చెదరకుండా కాపాడుకో దలచిన వారంతా, ఎప్పటికీ ప్రమాదకరమే అయిన 'లైపాయిడ్స్' ను గురించి తప్పక చదివి తెలిసికోవాలి.



మెక్లీన్సు మామూలుపద్ధతిని తోముటలో అందని అపాయకరమైన చోట్లకు సూటిగా పోరబడి శుభ్రపరచును.

## దంతక్షయాన్ని అరికట్టుటకు అత్యంత ప్రధానమైనది అదే

మీ దంతాలమీద ఏర్పడిన జారుపొరలో కొన్ని కొవ్వు పదార్థములున్నవి. వీనినే 'లైపాయిడ్స్' అని దంత వైద్యులు నిరూపించి యున్నారు. వీనిని ఎంతబాగా తోమినా పోవు. ఆ పొరలోపలా వెనకా అవి తమ భయంకరమైన పనిని సాగిస్తూనే వుంటాయి. అవి మీ పళ్ల మెరుగును తినివేస్తూనే వుంటాయి. ఆ దంతక్షయను అరికట్టడానికి తొలిమెట్టు ఈ 'లైపాయిడ్స్'ను క్రమం తప్పకుండా తొలగిస్తూనే వుండడం.

'లైపాయిడ్స్'ని విశేషంగా తొలగించటానికి ఉన్న ఒక్కటే మార్గం, వానిని కరిగించివేయడం. నోటినిండా నురగను కలిగించక బహు సున్నితముగాను, చాల సురక్షితంగా, అతి శీఘ్రంగా 'లైపాయిడ్స్'ను, సూటిగా సాధించే గుణమును మెక్లీన్స్ కలిగియున్నది. అదే దంత క్షయాన్ని అరికట్టుటకు అత్యంత ప్రధానమైనది.

మెక్లీన్సును క్రమం తప్పక రోజుకు రెండుసార్లు ప్రతిరోజు వాడండి. మరి, జ్ఞాపకం వుంచుకొనండి. మెక్లీన్స్ ధావళ్యంగల దంతాలే ఆరోగ్యవంతమైన దంతాలు.




క్లోరోఫిల్ కలదిన్నీ లభిస్తుంది

MTY-41-TEL

 

# వరనిర్ణయము



...ంతవరకుయినా వ్యక్తము చేయటానికి సిద్ధపడాలి: అటువంటి పురుషులే స్త్రీల యెడ ప్రేమకలవారు, అని అనుకోవటము కూడా ఉన్నది.'

'కొంతమంది స్త్రీలు తమ విషయాలలో సౌఖ్యము కలిగించుకొని భర్తలు కావాలని అటువంటివారు తటస్థపడితేనే సుఖపడతామని భావిస్తారు. భార్యల కట్టుబాట్లు వ్యవహారాలలోగాని, గృహపాలనలోగాని నిర్ణయము తమదే ఉండాలని వాంఛిస్తారు. బిడ్డల పోషణ, శిక్షణ, అభ్యుదయము మొదలైనవన్నీ తమ అభిమతానుసారముగా జరిగిపోవాలని, అప్పుడే సుఖపడతామని ఆశించేవారున్నారు.'

'డబ్బు సంపాదించి చేతికిస్తే చాలు. అన్ని విషయాలూ మేమే చూసుకుంటాము' అనే జాతికూడా స్త్రీలలో లేకపోలేదు. ఈ జాతిస్త్రీలు ఇతరులు తమ విషయాలలో జోక్యము కలిగించుకొంటే సహించలేరు. స్త్రీలలో ఈ రకాలవారు లేరని చెప్పటము సాహసమవుతుంది. కాని అధిక సంఖ్యాకులు కాని అందరూగాని ఈ రకమే అనటము కూడా సాహసమే.

స్త్రీల చిత్తవృత్తులను ఈ దృక్పథముతో గమనించిన పురుషులు ఈ గుణాలు ప్రస్ఫుటముగా కనబడేటట్లుగా పైకి కొంతకాలము, కనీసము తాత్కాలికముగానయినా ప్రవర్తించటానికి ప్రయత్నిస్తూ ఉంటారు. సరళముగా, నమ్రతతో, ప్రియమార సంభాషించటానికి ప్రయత్నాలు చేస్తూ ఉంటారు. తమ ప్రతిభనూ, పరాక్రమాన్నీ వెల్లడి చేస్తూ, ప్రసంగిస్తూ ఉంటారు. తమకు డబ్బు మీద నిర్లక్ష్యమని ప్రకటిస్తూ, ప్రత్యక్షముగా చూపిస్తూ ఉంటారు. అనవసరముగా అప్రస్తుతముగా స్తోత్రము చేయటము, సానుభూతి చూపటము, అతిగౌరవము, మర్యాద ప్రకటించటము మొదలయినవి పురుషులకు సంబంధించినంతవరకూ యీ శ్రేణికి చెందినవే.

స్త్రీ పురుషులిద్దరికీ ఒకరిని గురించిన ఆశయాలు, కోరికలు మరొకరికి ఉండటము సహజము. సృష్టి జరిగినప్పటినుండీ స్త్రీ పురుషులు ఈ మార్గాన ఆలోచిస్తూనే ఉన్నారు. కాని-కాలప్రభావంవల్ల వాటిని బహిర్గతము చేయటములో మనకు మార్పులు కనబడుతున్నాయి. స్త్రీ పురుషు లిద్దరిలో స్త్రీకి, పురుషుడిని గురించిన ఆశయాలు కోరికలు వెల్లడిచేసే అవకాశము తగినంతగా పూర్వకాలములో లభించలేదు. ప్రత్యేకాభిరుచులు లేకుండా నిర్ణయించబడిన వరుడినే వివాహమాడి వ్యక్తిగతాభిప్రాయాలకు ఎక్కువ తావులేని జీవితాలను 'అంతా బాగుంది అందరూ మంచివాళ్లే' అన్నట్టుగా గడిపారు. కాని పురుషుడు మొదటినుండీ తన వ్యక్తిత్వాన్ని అధికారయుతముగా నిలబెట్టుకుంటూనే వచ్చాడు. కొంతకాలము క్రిందటనుండీ స్త్రీలు తమ వ్యక్తిగతాభిప్రాయాలను వ్యక్తీకరించగలుగుతున్నారు. జీవితాలలో తమ ఆశయాలు, అభిప్రాయాలు సమర్థింపబడాలని ప్రయత్నించడములో ధైర్యము వహించారు. కాని ఎదురు తిరిగిన పరిస్థితులలో, తలవంచుకొని పట్టాల మీద రైలు సాగిపోయినట్లుగా వైవాహిక జీవితాలను ఒడిదుడుకులతో సహా సాగించవలసినవారయినారు.

కాని స్త్రీల పరిస్థితులలో ఈ కాలములో అనేక మార్పులు కలుగుతూ రావటమువల్ల వ్యక్తిత్వము పోషింపబడవలసిన సమయము వచ్చింది. ఇప్పుడు స్త్రీ అన్నిటిలో పురుషుడితో సమానురాలు, అట్లాగని శాసన రీత్యా సమర్థించబడ్డది. కుమారుడితోపాటు తండ్రి ఆస్తిలో ఆమెకు సమానాధికారము కలుగబోతున్నది. అన్నిరకాల ఉద్యోగాలలో స్త్రీలకు ప్రవేశము ఉన్నది. వేతనాలలో స్త్రీపురుష భేదము చూపకూడదన్న అంశాన్ని ప్రభుత్వము ఆలోచించబోతున్నది. సౌఖ్యములేని వివాహాలను రద్దు చేసుకోవటానికి శాసనరీత్యా అవకాశము లభించింది. స్త్రీవిద్యాభివృద్ధికి సమకూర్చ గలిగినన్ని సదుపాయాలు కల్పించటానికి భారతప్రభుత్వము ప్రయత్నిస్తున్నది. ఈ పరిస్థితులలో కన్య ఎటువంటి వరుని కోరుకుంటుంది?

రూపముగల యువకుని కోరుకుంటుందా? ధనముగల యువకుని కోరుకుంటుందా? ధనవంతుడైన వయోవృద్ధుని కోరుకుంటుందా? సహృదయుడైన యువకుడు ధనవంతుడు కాకపోయినా వరిస్తుందా? కేవలము స్టేటస్, ఉద్యోగము మాత్రమే చూస్తుందా? విద్యా విజ్ఞానాలకు ప్రాధాన్యత ఇస్తుందా?

ఇంతకాలమునుంచీ స్త్రీల చిత్తవృత్తులనుగురించీ, వాళ్ళ అభిరుచులనుగురించీ, ఆశయాలనుగురించీ వాస్తవమైన విషయాలు వెల్లడి కావటానికి అవకాశము కలుగలేదు. 'స్త్రీ ఇట్లా ఉంటుంది. ఈ విధముగా మాట్లాడుతుంది. ఈ రకముగా ప్రవర్తిస్తుంది' అని చెప్పగలిగినవాడు పురుషుడయినాడు. 'అట్లాగా'? అనే పరిస్థితి స్త్రీకి ఏర్పడ్డది. కాలము కల్పించిన సదుపాయాలవల్ల మానవ స్వభావములో ఉన్న సంకుచితత్వము నశించే అవకాశాలు చాలా ఏర్పడ్డాయి. విశాలమయిన వాతావరణములో మంచి శిక్షణ పొంది విద్యావిజ్ఞానాలను ఆర్జించి, సంపూర్ణమైన మనోవికాసముపొంది యుక్తాయుక్తవిచక్షణకల స్త్రీ స్వాతంత్ర్య వాయువును పీలుస్తూ ఎటువంటి వరుని కోరుకుంటుంది?

ఒక మాటమీద నిలబడి, ఒక ధర్మానికి కట్టుబడి, స్త్రీ గౌరవము కాపాడినందువల్లనే తాను గౌరవము లభిస్తుందనే యువకుని ఎన్నుకుంటుందా? ఆ తరుణానికే అందరమూ ఎదురు చూడవలసి ఉన్నది.

★

**"ఇంకెక్కడా అనకు!"**

"నిన్న దెయ్యాన్ని చూశానండి తెలుసా?" అన్నాడు ఒక వెంగళాయి అతి గంభీరంగా.

"ఎక్కడరా ఎప్పుడూ" అన్నాడు ఊరిపెద్ద నవ్వుతూ.

"నిజంగానే నండి. నిన్న రాత్రి. శివాలయం గుడి గోడ మీద చేరబడి కనబడిందండి"

"ఏడిశావు. అయినా ఎలా ఉంది చెప్పు?"

"అచ్చు గాడిదలా ఉంది. పెద్ద గాడిదన్నమాట."

"అరి వెంగళప్పా. నాతో చెబితే చెప్పావు గాని, ఇంకెక్కడా చెప్పబోకు. అది దెయ్యం గాదు. నీ నీడే సుమా!"

RATNAM'S 'N' OIL
సేవించిన పూర్తి సంతోష సౌఖ్యము లనుభవించగలరు.
1 సీసా రూ. 11-4-0.
ఎడ్రస్సుతో జాబు వ్రాయండి.
డాక్టర్. రత్నం సన్స్,
మలకపేట బిల్డింగ్స్, హైదరాబాదు - 2.

# బింబిసారుని పూదోట

అనగా అనగా ఒక రాజు ఉండేవాడు. అతని పేరు బింబిసారుడు. ఆయన అంగ, వంగ, అవంతి, కాశీ రాజ్యాలకు రాజు. ఆయన పాలన క్రింద జనం హాయిగా ఉండేవారు. ఆయన రాజ్యాన్ని పెద్దది చేయవలెనని ఒకసారి వైశాలి రాజ్యంపై దండెత్తెను. ఆ వైశాలిరాజు బింబిసారునకు లొంగిపోయెను; కానుకగా కూతురునిచ్చి పెండ్లి చేసెను.

బింబిసారుని బలపరాక్రమములు చూచి అతనిని ఎదుర్కొనే రాజే అరుదయ్యెను. ఆరీతిగా ఆ రాజు రాజ్యాలకు రాజ్యాలే జయించి మహారాజాధిరాజయ్యెను.

అసలు మహారాజులకు పేదల కష్టాలు కనుపించవు. పైగా వారు కఠినుగా ఉండుట మామూలు కాని బింబిసారుడు చాల దయగల రాజు. అతని రాజఠీవి చూచి జనం మాడిలిపోయేవారు. అయితే ఆపదలో నున్నవారికి, అడిగినవారికి "లేదు" అనేవాడు కాదు బింబిసారుడు.

బింబిసారుడు మగధరాజ్యమును పూలతోటలతో ఉద్యానవనములతో కన్నులపండుగ చేయసాగెను. రాజగృహమును అందమైన ఉద్యానవనాలతో చూడముచ్చటగా అలంకరింపజేశాడు. గాయకులు రాజగృహంలోని పూలతోట సొంపు దేశదేశాల గానం చేసేవారు. పరాయిదేశస్థులు వచ్చి ఆదేశంలో చూడదగిన వింతల్లో రాజగృహోద్యానవనం ఒకటి.

ఆ ఉద్యానవనాన్ని చూడవచ్చిన వారికి అన్ని సదుపాయములు చేయించాడు ఆరాజు. ఆ పూలతోటను చూచి మురిసిపోయేవాడు. ఆనందంతో పరవళ్లు త్రొక్కేవాడు.

దేశం నలుమూలలనుండి ఎందరెందరో రాజులు అందమైన పూలతోటను చూడవచ్చారు. ఆ నాడు తెలుగుదేశానికి రాజు రాజ్యశ్రీ. ఆయన బింబిసారుని పూలతోట గొప్పదనం విని చూడవలయునని ఉబలాటపడ్డాడు.

మద్దులూరి రామకృష్ణ

ఆ బింబిసారుని పూలతోట ఎట్లాగైనా చూచి తీరాలనుకొన్నాడు రాజ్యశ్రీ. మంచిరోజు తిథి, వార నక్షత్రాలు చూచి ప్రయాణమయ్యాడు. బింబిసారుడు రాజ్యశ్రీ పూలతోట చూడవస్తున్న వార్త విని గర్వంతో చాల సంతోషించాడు. రాజమర్యాదలు చేసి రాజ్యశ్రీని గౌరవించాడు. కళకళలాడే పచ్చపచ్చని అందమైన పూలతోటల సొంపుచూచి ఎంతో సంబరపడ్డాడు. రాజ్యశ్రీ అజంతా చూస్తే అంత అందమైన పూలతోట నేలపైన ఎక్కడైనా ఉందా! ఇది నిజమా - కలా అనిపించింది అతనికి.

"నా దేశాన్ని ఇంకా అందంగా చేయాలని ఉంది. కాని ఇందువలన చాలమంది మనసులు బాధ పడవచ్చు. ఇతరులు ఎంతో కష్టపడి ప్రేమతో కట్టుకొన్న ఇళ్లు నేలమట్టం చేయవలసివస్తుంది. ఏమయినా సరే కాని జనం నన్ను ప్రేమిస్తే అదే పదివేలు" అన్నాడు బింబిసారుడు.

నా తెలుగుదేశాన్ని కూడ మీ రాజ్యమంత అందంగా చేయ ప్రయత్నిస్తా. మీ రాజ్యాన్ని చూడటం నాకెంతో ఆనందంగా ఉంది. సెలవు తీసికొంటా" అన్నాడు రాజ్యశ్రీ. ఆ సాయంత్రం బింబిసారుడు రాజ్యశ్రీ, ఉద్యానవనంలో పొదరింట్లదాపున మెత్తని రత్నకంబళి పరచియున్న పచ్చిగడ్డి పరుపుపై కూర్చొని వికసించిన గులాబీలు, మందారాలు, సంపెంగలు ఇంక రకరకాలయిన రంగురంగుల పూలు తనివితీర చూస్తూ ఆనందాన్ని జుర్రుతున్నారు.

ఇంతలో ఎందుచేతనో ఏమో వికసించిన బింబిసారుని ముఖం క్షణంలో చిన్నబుచ్చుకుంది. "ఏమి అలా ఉన్నారు" అన్నాడు రాజ్యశ్రీ. "అసలు మునుపు ఇచ్చట పూలతోట లేనే లేదు. ఈ తోట వేసిన చోటు నాది కాదు."

"మరి ఎవరిది?"

"ఇదొక ముసలమ్మది."

"నిజంగానా? ఆమె మీకు అమ్మిందా?"

“నే పుట్టినగడ్డ ఎవరికీ అమ్మను” అని అతి జాలిగా ప్రతిమాలింది. అదమాయించి, గదమాయించి ఆమెను అక్కడనుండి బలవంతంగా వెళ్లగొట్టించా.”

“ఆమెకు నచ్చజెప్పి తేరగా చోటు చూపి తీసికొన్నా ఎంతో బాగుండేది కదూ?”

“ఔను నిజమే” అన్నాడు ఎంతో చిన్నబుచ్చుకున్న ముఖంతో బింబిసారుడు. అతనికి తెలియకనే కన్నులు [illegible] అయినవి.

“అందమైన తోట వెయ్యాలనే ఆత్రంతో, పాపం! ఆ ముసలి దాని నోట దుమ్ముకొట్టా — ఆ ముసలి దాని పూరిగుడిసె పీకివేయించా. అయ్యో, ముత్తో అని ఏడుస్తూవుంటె అవతలకు నెట్టివేయించా” అన్నాడు బింబిసారుడు.

చాలసేపు బింబిసారుడు, రాజ్యశ్రీ మాటాడక ఒకరినొకరు చూస్తూ [illegible] అలాగా కూర్చున్నారు. రాజ్యశ్రీ బింబిసారుని చూచి చిరునవ్వు నవ్వాడు. బింబిసారుని కన్నుల వెంట కన్నీరు ప్రవహించింది.

“నేను మూర్ఖుడను” అని విచారంతో ఒక్కమాటకన్న ఎక్కువ అనలేకపోయాడు బింబిసారుడు.

“ఇంత అందమైన పూదోటను నీ రాజ్యంలో మరెచ్చటా చూడలేదు. దీనిని చూచి లోకం ఏమనుకుంటుంది. ఆ సంగతి వింటే నీ మనస్సు ఏలాగుంటుంది” అన్నాడు రాజ్యశ్రీ.

బింబిసారుడు మారు మాటాడలేకపోయాడు. ధర్మంగా పాలించే మగధరాజువు నీవేగా అని బింబిసారుని భుజాల తట్టి నిదానంగా ఆయన కన్నులులోనికి చూచాడు రాజ్యశ్రీ.

“నా సుఖం-ఆనందంకోసం-ఎవరికీ అపకారం తలపెట్టను. ఒట్టు-నీ రాకవలన నాకెంతో మేలు కలిగింది” అని మెల్లగా అన్నాడు బింబిసారుడు.

“నిజంగా ధర్మరాజు అంటె మీరే. న్యాయానికి ఎంతో విలువ యిస్తారు” అని దీర్ఘ ఆలోచనలోనున్న బింబిసారునివైపు రాజశ్రీ చూచాడు.

“మా రాజ్యానికి ఎంతో దయగల రాజుగా తిరిగి వెళ్లుచున్నా. మీ మేలు ఎల్లకాలం మరువలేను” అన్నాడు రాజ్యశ్రీ.

“రాజ్యశ్రీ! నీవు మంచిరాజువు” అన్నాడు బింబిసారుడు నిదానంగా.

“లేదు-లేదు-ఇక ముందు నేను మంచి రాజుగా ఉండ ప్రయత్నిస్తాను”-అన్నాడు రాజ్యశ్రీ. ★





పెద్ద గడబిడ

మా షావుకారువకు ఒక్క క్షణము కూడా విశ్రాంతి లేదు. కాని స్నానము చేయునప్పుడు ఈయన చేసే గడబిడతో పోలిస్తే, స్టాకు మార్కెటులో ఈయన చేయు గడబిడ యెందుకూ కొరగాదు. ఇదంతా హమామ్ సబ్బుయొక్క ప్రభావం. షావుకారుగారేమంటారంటే జీవితంలో విశ్రాంతి పొందుటకు సాధనం హమామ్ సబ్బుని. ఇటువంటి ప్రకటనలో మాకు నమ్మకములేదు, కాని షావుకారుగారేమన్నా చెప్పనివ్వండి లేక చెయ్యనివ్వండి, ఒక్క విషయం మాత్రం తప్పక ఒప్పుకొని తీరాలి, అదేమిటంటే స్నానమునకు వాడికవచ్చే సబ్బులలో హమామ్ సర్వోత్కృష్టమైనది.

అత్యధిక ఉత్సాహము పొందుడి




టాటా యొక్క

హమామ్

టాయిలెట్ సబ్బు

టాటా ఆయిల్ మిల్స్

బాలసాహితి సీరియల్

# సాగర గర్భంలో సాహస యాత్ర



మూలం: జూల్స్ వెర్న్

## జరిగిన కథ :—

అది 1866 వ సంవత్సరం ప్రారంభం. సాగర గర్భంలో బ్రహ్మాండమైన జలజంతువేదో కనిపించిందనే వార్త ప్రపంచప్రజలను విభ్రాంతులను చేసింది. సముద్రంలో ప్రయాణంచేసే నౌకలకది ఇట్టే కనిపించి ఇట్టే మాయమయ్యేది. దానివలన నాగరిక ప్రపంచానికి, ముఖ్యంగా నౌకాప్రయాణాలకి ప్రమాదం సంభవించవచ్చునని అందరూ అభిప్రాయపడ్డారు. దానికి అంతు కనుక్కొని నాశమార్గాలని ప్రయత్నాలు ప్రారంభమయ్యాయి. అమెరికా ప్రభుత్వం అబ్రహాం లింకన్ అనే యుద్ధనౌకను ఆ జలజంతువును వేటాడడానికి నియమించారు. అమెరికాప్రభుత్వ నౌకాశాఖా కార్యదర్శి హాబ్సన్ ఫ్రెంచి ప్రకృతిశాస్త్రపరిశోధకుడు ప్రొఫెసర్ అరోనాను ఈ విజ్ఞానయాత్రలో పాల్గొనవలసిందని ప్రార్థిస్తాడు. అతడు వెంటనే దాని కంగీకరించి తన పరిచారకుడు కౌన్సిల్‌తో సహా ఓడ ఎక్కుతాడు. అబ్రహామ్‌లింకన్ క్రమక్రమంగా పసిఫిక్ ఆమహాసముద్రంలో ప్రవేశిస్తుంది. అది అలాగ కొంతదూరం ప్రయాణం చేసేసరికి కొంతదూరంలో సముద్రతరంగాలమీద ఒక పెద్ద వెలుగుకనిపించింది. ఆ వెలుగు ఒక పెద్ద జలచరానికి సంబంధించినదై ఉండాలని నౌకాధికారులంతా ఊహించారు. నావ దానిదగ్గిరికి పట్టించి దానిమీద ఫిరంగిగుళ్లవర్షం కురిపించారు. అబ్రహామ్‌లింకన్ తరవాత జరిగిన పోరాటంలో ఎందుకు పనికిరానిదై పోతుంది. ప్రొఫెసర్ అరోనా మరి కొందరితో సహా సముద్రంలో పడిపోతారు. సముద్రంలో పడికొట్టుకుపోతూ కొంతసేపటికి ప్రొఫెసర్ అరోనా, కౌన్సిల్ నెడ్‌లాండులతో కలిసి ఒక జలాంతర్గామిలో ప్రవేశిస్తారు. కొంతసేపటికి ఓడనావికులు వారికి సుష్టుగా భోజనం పెడతారు. భోంచేసి అందరూ హాయిగా నిద్రపోతారు. తిరిగి తమ కన్నపానాలు రాలేదని అంతా మథన పడుతూంటే వారికి హఠాత్తుగా జలాంతర్గామి అధికారి హెచ్చరిక వినిపిస్తుంది.

అనువాదం: "వినాయక"

## 10

ఈరీతిగా మాటలాడిన వ్యక్తి జలాంతర్గామి సర్వాధికారి కెప్టెన్ నీమో.

నెడ్‌లాండ్ అతనిని చూడగానే గభాలున లేచి నిలబడ్డాడు.

పాపం! మాకు భోజనం పట్టుకు వచ్చిన ఆ నౌకరు యజమాని సైగ చేసేసరికి మారుమాటాడకుండా పిల్లిలాగ మెల్లిగా అతని దగ్గిరికి వెళ్ళి నిలబడ్డాడు. అంతేగాని కిక్కురుమన లేదు. కౌన్సిల్ అదంతా చూచి నిర్ఘాంతపోయి అలాగే నిలబడిపోయాడు.

కెప్టెన్ నీమో తన కెదురుగా ఉన్న బల్లవైపు కొంచెం ఆనుకుని, చేతులు దండకట్టి తీవ్రంగా మాకేసి చూస్తూ నిలుచున్నాడు. మా కవరికి ఏమనడానికీ పాలుపోలేదు: అలాగే గుడ్లప్పగించి చూస్తు

ర్నాము. అటుపిమ్మట కెప్టెన్ నీమో గంభీరంగా ఇలాగన్నాడు:

"అయ్యా! నాకు ఫ్రెంచి ఇంగ్లీషు, జర్మన్, లాటిన్ భాషలు నాలుగు బాగా వచ్చును. నేను మొదట మీతో మాట్లాడినపుడే మీకు సమాధానా లిచ్చిఉండును. కాని మీరు మాట్లాడినవన్నీ కొంచెం జాగ్రత్తగావిని అటుపిమ్మట వాటి విషయంలో కొంత లోతుగా ఆలోచించాలని అనుకొన్నాను. మీరు నలుగురు చెప్పిన కథలు బేరీజువేసి చూస్తే మీరన్నదంతా చాలావరకు నమ్మదగ్గట్లుగానే ఉంది. నాకు హఠాత్తుగా తలవని తలంపుగా మీ ఎదుట నిలబడే అవకాశం కలిగింది. మీ వృత్తాంతాలు మీ పేరులు నాకు తెలిసిపోయాయి. మీ ఓడ పుట్టుపూర్వోత్తరాలు అది బయలుదేరిన కారణం మొదలైనవన్నీ నాకు బాగా తెలుసును."

ఆ మాటలు విని నే నంగీకార పూర్వకంగా శిరఃకంపం చేశాను. అంతకంటె ప్రత్యేకంగా వేరే సమాధాన మివ్వవలసినంతటి అవసరమేమీ లేదు. కెప్టెన్ నీమో చాలా సహజధోరణిలో ప్రసంగించాడు. అతనిమాటలలో ఎక్కడా విదేశీయుల యాస వినబడలేదు. అతడు ఫ్రాన్సుదేశీయుడే అయి ఉండవచ్చునని అనుకొన్నాను. కెప్టెన్ నిమో మళ్ళీ మొదలు పెట్టాడు.

"నేను మళ్ళీ వచ్చి మీతో మాటాడలేదేమని అనుకుంటున్నారేమో! అయితే మీ సంగతి ఆలోచించుకోవడంకోసమే నేనింత కాలం ఆలస్యం చేశాను. మానవ జాతితో నాకు గల సంబంధ బాంధవ్యాలన్నీ పూర్తిగా తెంచి వేసుకొన్నాను. దురదృష్టవశాత్తు మీరందరు ఇటువంటి వ్యక్తి చేతులలో చిక్కుకొన్నారు. నామానాన నన్నుండనీయకుండా నాకేదో చికాకు కలిగించడానికే మీరందరు ఇక్కడికి వచ్చారు.—" అని కెప్టెన్ ఇంకా ఏదేదో చెప్పబోయాడు. నేను మధ్యలోనే అతని మాటల కడ్డుతగిలి.—

"ఇదంతా తలవని తలంపుగానే జరిగిపోయింది!" అన్నాను.

కెప్టెన్ కంఠస్వరం కొంచెం హెచ్చించి మళ్ళీ గంభీరంగా ఇలాగన్నాడు:

"ఇదంతా తలవనితలంపుగానే జరిగిందా? వట్టి మాట! అబ్రహామ్ లింకన్ తలవనితలంపుతోనే నన్ను వెంటాడించిందా? మీరందరు ఈ ఓడ ఎక్కడం తలవనితలంపుగానే జరిగిందా? మీ తుపాకుల గుళ్ళనా జలాంతర్గామికి తగలడంకూడా తలవనితలంపుగానే జరిగిందా? నెడ్ లాండ్ బల్లెం విసరడం తలవనితలంపుగా చేసిన పనేనా?"

"మీ ఓడ మూలంగా యిరోపాలోను, అమెరికాలోను బయలుదేరిన గందరగోళం సంగతి మీకు తెలిసిఉండకపోవచ్చును. బయలుదేరేటప్పుడు మాఓడలోనివారంతా తామేదో తిమింగిలాన్ని వేటాడడానికే బయలుదేరుతున్నామని అనుకొన్నారు." అన్నాను నేను.

కెప్టెన్ పెదవులపై ఒక చిన్న చిరునవ్వు స్ఫురించింది. ఎక్కడా చెక్కు చెదరకుండా తిరిగీ అతడిలాగన్నాడు:

మీ అబ్రహామ్‌లింకన్ మాలాంజ తర్గామివంటి నౌకను వెంటాడించకుండా ఉంటుందనే నమ్మమంటారా?

ఈ ప్రశ్నతో నేను బాగా ఇరుకులో పడిపోయాను. నిజానికి మా ఓడ సర్వాధికారి కెప్టెన్ ఫరాగూ జలాంతర్గామినైనా వెంటాడించి ఉండేవాడే! తప్పకుండా దానిని నాశనం చేసి ఉండేవాడే!

తరవాత కెప్టెన్ మళ్ళీ అందుకొన్నాడు:

"చూశారా మరి? నేనిప్పుడు మిమ్మల్ని అందరినీ కేవలం శత్రువుల కింద పరిగణించవచ్చు నన్నమాట!"

దీనికి నేనేమీ సమాధానం చెప్పలేదు. దానికి కారణం లేక పోలేదు. బలమంతా ఇప్పుడా కెప్టెన్ చేతుల్లోనే ఉంది. ఆ బలప్రయోగం మూలంగా ఎలాంటి గట్టిసమాధానమైనా ఇట్టే ఎగరకొట్టి వెయ్యవచ్చును! ఇక నేను మాట్లాడితే మాత్రం ప్రయోజనమేమి ఉంది కనక! కెప్టెన్ ఇంకా అలాగే చెప్పుకు పోతున్నాడు!

"నేనీ విషయంలో చాలా చాలా తటపటాయించాను. నాకు మీ కందరికీ ఆతిథ్య మివ్వవలసిన పూచీ ఏమీ లేదు. మిమ్మల్ని అందరినీ మా జలాంతర్గామి పైభాగంమీదే ఉంచి మా ఓడ నీటిలోకి ముంచి వేస్తే ఒక్క నిముషంలో మీరందరు సాగరం అట్టడుగున పడిపోయి ఉండేవాళ్ళు! అవిధంగా మీపీడ విరగడై పోయి ఉండును!"

"నిజమే! అది అడివిమనుష్యులు

# ఇప్పుడు రెక్సోనాలో ఏదో క్రొత్త మార్పు ఉన్నది !




అది...

ఎంతో ఎక్కువ...

సువాసనైనది!

రెక్సోనా సబ్బు—
బాలాకాలము నిలిచుండే
హాయి కొరకు ఇప్పుడు ఇంకా—
మరీ యెక్కువ
పరిమళమును
గలిగియున్నది !

రెక్సోనా ప్రొప్రయిటరీ లిమిటెడ్, వారి తరఫున భారతదేశంలో తయారుచేయబడినది

# ★ సాగరగర్భంలో సాహసయాత్ర ★

చేసేపని! అంతే! కొంచెం నాగరకత కలవా రెవరు అలాంటి ఘాతుక కృత్యం తలపెట్టరు!" అన్నాను నేను. దానికి కెప్టెన్ వెనువెంటనే సమాధానం ఇచ్చాడు: "ప్రొఫెసర్, నేను నాగరికత కలవాణ్ణని అనుకోవడంలేదు! అలాంటి నాగరికతకోసం, నే నెన్నడు ప్రయత్నం కూడా చేసిఉండలేదు. నే నీ నాగరికతతోను మానవప్రపంచంతోను పూర్తిగా తెగతెంపులు చేసుకొన్నాను. అందుచేత నాకు నాగరకుల మర్యాద లవలంబించవలసిన ఆవశ్యకత ఏమీలేదు. ఇక ఎన్నడు వాటి విషయం నాదగ్గర ప్రస్తావించవద్దు!"

ఇది ఖచ్చితంగా చెప్పివేసిన మాట! ఆ తరువాత నీమో కళ్లల్లో క్రోధము, ఈసడింపు తాండవించాయి. వాటితో అతని బాల్య జీవితంలోని దుర్భర యాతనలన్నీ ఒక్కసారిగా నా కళ్ల కెదురుగా స్ఫురించాయి. కెప్టెన్ మానవజాతి నాగరకతాన్యాయసూత్రా లన్నిటితోను తెగతెంపులు చేసుకొన్నాడు. అతడిప్పుడు పూర్తిగా సర్వస్వతంత్రుడు! సముద్రం పైపైనే అతని నెవ్వరు ఏమీ చెయ్యలేనప్పుడిక సముద్ర గర్భంలో అతని నెవ రేమి చెయ్యగలరు? ఇక అతని నిలద్దుకోగలవా రెవ్వరు లేరు! అతగాడికి భగవంతుడంటూ ఒకడుంటే, అంతఃకరణ అనేది ఏ కోశానైనా ఉంటే—అవి కొంతవరకు అతణ్ణి అడ్డుకోగలవేమో!

ఈ ఆలోచనలన్నీ నా బుర్రలో గబగబా దొర్లిపోయాయి. నా కెదురుగా నిలబడిన కెప్టెన్ ఏదో గాఢాలోచనలో మునిగిపోయాడు. లోలోపల గడగడ వణికిపోతూ అతనికేసి అలాగే చూస్తూ నిలబడిపోయాను.

అలాగ కొంతసేపుగడిచిపోయిన తరవాత కెప్టెన్ నీమో మళ్ళీ ప్రారంభించాడు:

"అయితే నేను కొంత జాలికి లొంగిపోయిన మాట కూడా వాస్తవమే! మీరు నా ఓడలో ఉండిపోవచ్చును. దానికి నా అభ్యంతరమేమీ లేదు. మీ కీ ఓడలో కొంత స్వాతంత్ర్యం ఉంటుంది. అయితే మీకొక నియమం విధిస్తున్నాను. మీరా నియమానికి కట్టుబడిఉంటామని మాట ఇస్తే చాలు."

"దానికేమి? ఆ నియమమేమిటో చెప్పండి! అది పెద్దమనుష్యులు అంగీకరించగలిగిన నియమమే అనుకుంటాను."

"అవును! అది అలాంటి నియమమే! కొన్ని అత్యవసరపరిస్థితుల వల్ల కొన్నిగంటలవరకు మిమ్మల్ని ఒక గదిలో బంధించి ఉంచవచ్చును. ఆ నిర్బంధం ఒకప్పుడు కొన్నిరోజులవరకు పొడిగించవలసిన ఆవశ్యకత కూడా ఏర్పడవచ్చును. ఆ నియమానికి మీ రంతట మీరే లోబడాలి. రహస్య సంరక్షణ ఏర్పాట్లు మినహాయించివేస్తే మీ కన్నివిధాలా స్వాతంత్ర్యం ఏర్పడగలదు. ఈ నియమానికి మీ రందరు అంగీకరిస్తారా?"

అయితే ఈ ఓడ మీఁద సామాన్య మానవుల కంటబడకూడని రహస్యాలెన్నో జరుగుతున్నాయన్నమాట! తరవాత నే నిలాగన్నాను.

"మీ నియమానికి మేమంగీకరిస్తున్నాము. అయితే ఒక్కటంటే ఒక్క ప్రశ్న అడగడానికి మా కనుమతి దయచేయించండి! ఈ ఓడలో మాకెలాంటి స్వాతంత్ర్యం ఉంటుందో కొంచెం వివరంగా తెలియజెయ్యండి!"

"నాకు, నా సహచరులకు ఎలాంటి స్వాతంత్ర్యం ఉంటుందో మీకు అలాంటి స్వాతంత్ర్యమే ఉంటుంది. అయితే కొన్ని కొన్ని పరిస్థితులలో మాత్రమే అటువంటి స్వాతంత్ర్యం ఉండదు."

మా కిద్దరికీ ఒకరిమాట లొకరికి బోధపడినట్టు కనబడలేదు. నేన నెమ్మదిగా ఇలా గడిగాను:

"అయితే మన్నించాలి. మీ రిచ్చేది సామాన్య ఖైదీ లనుభవించే స్వాతంత్ర్యంవంటిదే నన్నమాట. అది మాకు సరిపోదు."

"దానితో నే సరిపెట్టుకోవాలి!"

—ఇంకా ఉంది.


హకల్ బెరిఫిన్

వెల రూ. 2-0-0

పోస్టుఖర్చులు అదనము.

ఆంధ్రగ్రంథమాల,

మద్రాసు-1.



స్కినెడెక్స్

గజ్జి, దురదలు, పుండ్లు మొ॥

చర్మవ్యాధులకు దివ్యాంజనము

శ్రీవత్స కెమికల్స్ & డ్రగ్స్

లిమిటెడ్, మద్రాసు-30.

# కొత్త గొడుగు

బాబు వరండాలో కూర్చొని లెక్కలు చేసుకుంటున్నాడు. పాప రిబ్బను లేదని గోల పెడుతూంది. పసిపాప గిలక్కాయ కొరకు మారాంలో శ్రుతి హెచ్చించాడు. వంటగదిలో సీతమ్మగారు కూరలు తరుగుతూంది. పనిమనిషి త్వరత్వరగా అంటుగిన్నె తీసికొని దొడ్లోకి వెళ్లిపోయింది. యీ గోలలో యిల్లంతా గందరగోళంగా వుంది. కుటుంబరావుగారు ఎన్నాళ్లనుండో అనుకుంటున్నారు ఎలాగైనా ఒక ఛత్రీ కొనాలని. ఎప్పుడూ ఏదో ఒకటి ఆకస్మిక అవాంతరం వచ్చిపడటం గొడుగుకొరకు అట్టే పెట్టిన డబ్బు స్వాహా అయిపోవటం జరుగుతూండేది.

. ఏది ఏమైనా ఆ నెలలో జీతమందగానే గొడుగు కొనుక్కొని... అందులో బుట్టమార్కు గొడుగు... అతను ఎన్నాళ్లనుండో మనసులో మననం చేసుకుంటూ తలచిన బుట్ట మార్కు గొడుగు సివాః! అంటూ కొనుక్కొని యింట్లో కాలుపెట్టిన కుటుంబరావుగారిని చూస్తూ సీతమ్మగారు నివ్వెరపోయి చూస్తూంది ఛత్రీవంక.

'ఏమేవ్! యీ దినం ఛత్రీ కొన్నాను. బుట్టమార్కు ఛత్రీ యిదిగో' అంటూ సీతమ్మగారి కందించాడు, బాబును ఒక చేత్తో పట్టుకుని. గొడుగువంక ఎగా దిగా చూచారు బాబు, పాప, పసిపాప. వాళ్ళ మారామంతా ఏమయిపోయిందోగానీ 'నేనే ముందు చూస్తానంటే నేనే ముందు' అని పాపా, బాబు సీతమ్మగారి చేతిలోని ఛత్రీ గుంజుకోబోయారు. సీతమ్మగారు యిద్దరికీ రాజీకుదిర్చింది.

కునికిపాట్లు పడుతూ, పుస్తకం ముందేసుకొని కూర్చున్న బాబుకు గొడుగు జ్ఞప్తికొచ్చింది. ఎలాగో ఆ తొమ్మిది అయిందనిపించి పక్కపై పరుండి గొడుగును గూర్చి ఆలోచన సాగించాడు పావుకాలంగా బాబు. పాపకి దేమి పట్టక వెంటనే నిద్రించింది.

## రావిళ్ల కృష్ణారావు

బాబు కారాత్రి ఛస్తే నిద్ర పట్టలేదు.

'గొడుగు. బుట్టమార్కు క్రొత్త గొడుగు. అచ్చం మా మాస్టారుగారి ఛత్రీకిమల్లేనే వుంది. కాకుంటే అది కాస్త పాతది. మధ్యాహ్నం ఒకటిన్నర గంటలకు మాస్టారు తను స్కూలుకు కలిసే వెళ్ళేవారు. మాస్టారు యిల్లుకూడ మా వీథే. ఎర్రని ఎండలో మాస్టారుతో నడుస్తున్నప్పుడు తన తల రోజూ మాడిపోతుండాయె. మాస్టారు ఒక్కనాడైనా 'ఒరేయి బాబూరావు అలా ఎండలో ఎందుకు నడుస్తావ్. యిలా నా ప్రక్కకు రా ఛత్రీ క్రిందికి' అన్నాడా ఆ పాపిష్టి నోటితో. రోజూ కాకిలా యింటికీ స్కూలుకీ పోయాలాయె. కూరగాయలు తెచ్చిపెట్టాలాయె. బజారుకీ......ఎటు పొమ్మంటే అటు చచ్చినట్లు...గుక్క నీళ్లు గుక్కుకుంటు పోవాలాయె. తను ఎంత వుబలాటపడినా ఒక్కసారయినా ఆ ఛత్రీకింద ... కనీసం...అథమం ఒక్కసారి! ముట్టుకునే యోగం పట్టదాయె!

నాన్నగారు ఛత్రీ తెచ్చారు. రేపు రెండుగంటలకు మంత్రిగారొస్తారు హైస్కూల్ శంకుస్థాపనకు. ఎంతమందో వస్తారు కార్లలో, సైకిళ్ళపై, నడకతో.

రేపు మధ్యాహ్నం బాలభట విన్యాసం. తను కూడ కాకీ ఆఫ్ షర్ట్, కాకీ నిక్కర్, మెడలో దస్తీ రంగురంగులది కట్టుకుని స్మార్టుగా నీట్‌గా గొడుగేసుకుని ఎండలో తలమాడి వగర్చనవసరం లేకుండా వెళితే ఎంత బాగుంటుంది. ఎలాగైనా రేపు క్రొత్త గొడుగు స్కూలుకు తీసుకెళ్లాలి. తన స్నేహితుల కందరికీ చూపాలి! వాళ్లంతా తనని ట్రూప్ లీడర్ కంటె గౌరవంగా పలకరిస్తారు!' బాబు మెదడులోనికి యిత్యాది ఆలోచనలు వచ్చాయి. వెంటనే,...

'అమ్మో నాన్నగారు ఛత్రీ యిస్తారూ? యివ్వరు. పైగా యీ రోజే కొన్నారాయె క్రొత్తగొడుగు. తను నాన్న నెలాగూ అడగలేడు. ఎటూ పోయినా యిక అమ్మే!

## ఉత్పల సత్యనారాయణాచార్య

కుమ్మరొకడు సంతలోన
కుండలను జాడీలను
చట్టిలను మూకుడులను
చుట్టు పేర్చి అమ్ముచుండె

అందులోని జాడి యొకటి
అనిన దిట్లు చట్టితోడ
"చట్టీ! నిను చూడ నాకు
జాలి పుట్టుచున్నదమ్మ!

ఎన్నడైన జనులు నిన్ను
మన్ననగా చూచినారె?
ధనికు లిండ్ల నొక్కపూట
మనెడి భాగ్య మున్న సెకు?

నిను చౌకగ పేదవారు
కొని ఎంతయు కరుణలేక
మండుపొయ్యిమీద పెట్టి
మసిచేతురు నీ రూపము

ధనికులైన జనులు నన్ను
కొని ఘనముగ చూచుచుండ్రు
విలువ గలుగు సరకు పోసి
నిలువయుంచుకొందు రెపుడు

తడవ తడవ నన్ను తుడిచి
మడిగుడ్డలు కట్టబెట్ట
మేలిముసుగు కన్నెవోలె
మిసమిసమని మెఱయుచుందు

చూడు చట్టి! నే నెంతటి
బాగను గలిగియున్నానో!"

జాడి యనిన మాటలు విని
చట్టి యిట్లు బదులు చెప్పె
"నిను చేసిన మట్టితోనె
నన్ను కూడ చేసినారు

మన మిరువుర మొక్కగుంట
మట్టిలోన పుట్టినాము
ఒక కుమ్మరి నిన్ను నన్ను
ఒనరించెను పొనరించెను

ఇరువుర మొక సారెమీద
తిరిగినాము పెరిగినాము
ఒక ఆవములోన కాలి
ఉన్నా మిపు డొక్కచోట

ఏ వేళకు మన మిరువుర
మే మాదుము ఎఱుగలేము
పగిలినంత నిన్ను నన్ను
పాఱవేతు రింటనుండి

నీకు నాకు రూపమందె
ఈ కొంచెము భేదముండె
మట్టిలోన పుట్టి మరల
మట్టిలోని కేగునట్టి

మన కెందుకు లేనిపోని
ఘనత-దురభిమాన చరిత!"

చట్టి యిట్లు చెప్పినంత
జాడి యంతొ చింతించెను
కావున, ఓ చిన్నవాడ!
గర్వింపకు నీవు కూడ.

## ★ కొత్త గొడుగు ★

సీతామహాలక్ష్మి! నాలుగుసార్లు దగ్గి ఒక్కరాగం ఏదో స్థాయిలో హుంహూ! ఊ!'తో ఆరంభిస్తే ...ఆరంభిస్తే! అమ్మ గొడుగు యిప్పిస్తుంది. నాన్న సణుగుతూ సణుగుతూ 'తీసికెళ్ళవోయ్! వెధవ గారమూ నీవూ! దీనితో మరీ చచ్చే రోజొచ్చింది. నిన్న కొన్నానో లేదో......' అంటాడు.

మర్నాడు మధ్యాహ్నం బాబు పాదిక పారింది. మాస్టారు చూస్తే ఏమనుకుంటారో నని కాస్తాముందుగానే స్కూలువైపు పరుగుతీశాడు కొత్తగొడుగేసుకుని బాబు.

మరో పది నిమిషములకు శంకుస్థాపన:

'ఎంతమంది ఫోటోగ్రాఫర్లు. ఎంతమంది రిక్షావాళ్లు. ఎన్ని కార్లు. ఎంతజనం! యింతమందిలో తను బాలభటవిన్యాసంలో పాల్గొంటాడు. బ్యాండ్ మ్రోగుతూంటుంది. ఫోటోగ్రాఫర్లు కెమెరాలను క్లిక్కు క్లిక్కు మనిపిస్తారు. ఓహో ఎంత దర్జా! బాబు హృదయం ఆనందాతిరేకంతో నిండిపోయింది.

.....సమయం సమీపించింది.

మంత్రిగారు దయ చేశారు.

స్కౌట్ మాస్టర్ విజిల్ మ్రోగించాడు.

బాబు లైన్లకు ఉరికి నిలబడ్డాడు చేతిలో గొడుగు.

బుట్టమార్కు క్రొత్త గొడుగు.

బాబు నొక విషమసమస్య ఎదుర్కొంది. గొడుగు నెక్కడ పెట్టాలి! తడబడుతూ అటూయిటూ పురుకులు పరుగులమీదుంది వ్యవహారం. స్కౌట్ మాస్టారు ఆలస్యమైతే కోపగిస్తారు? బాబుకు చిరుచెమటలు పోయసాగినై!!

వలయాకారంలో చుట్టేసిన జనసమూహంలోనుండి బాబుకు దగ్గరగా నున్న ఒక రిక్షావాలా 'యిలాతే బాబు. నేను పట్టుకుంటాను.' అన్నాడు. బాబు పేరెట్టి పిలవగానే తొందరలోనున్న బాబు (అంత

తొందరలో ఎవరైనా అంతకంటె హెచ్చు చేయలేరు లెండి!) విన్యాసానికి ఆలస్యమవుతుందని, యింత వరకు చీకాకు పరచిన ఆ ఛత్రీని వెంటనే యిచ్చేశాడు అతనెవరో తన నెరిగినవాడే ననుకుని!

ఆ తొందరలో ఆ ఛత్రీ 'ఎవరికివ్వాలి!' అనే ఆలోచనే రాకుండా చేసింది స్కౌట్ మాస్టర్ మెడల్! బాబును.

కెమెరాలు క్లిక్ క్లిక్ మని అంటూనే వున్నాయి.

బాలభటవిన్యాసంజరిగిపోయింది.

శంకుస్థాపన పూర్తయింది. ఉపన్యాసంకూడ అయింది.

సభ ముగిసింది.

బాబు పరుగెత్తాడు బుట్టమార్కు క్రొత్తగొడుగు కొరకాజన సందోహంవైపు!

కానీ! అదెక్కడుంది??

విచారవదనంతో యిల్లు చేరాడు బాబు!!

బాబుకు భూమిమీద కాళ్లు ఆనటం లేదు!!

'నాన్న నిన్ననే కొన్నాడు. బుట్టమార్కు కొత్తగొడుగు. ఆ బుట్ట ఎంత అందంగా వుందని! తన్నదే ఆక్రమించిందనలు. అది కాక మరేదయినాకొంటే...ఏమో! ఎలా వుండేదో. ఏది ఏమయినా 'నాన్న' యివ్వాళ్ల ఎలాగ వీపు హూనం చేస్తాడు. అదేమిఖర్మం! ఆయనది మహాపిచ్చికోపం! వళ్లే హూనం చేస్తాడు.' బాబు గుండె నీరయింది.

'నాన్న వచ్చే టైం అయింది. మెల్లమెల్లగా...అడుగులో అడుగు వేసుకుంటూ వంటగదిలో వున్న సీతమ్మగారి వళ్లోవాలి భోరుమని ఏడ్చేశాడు సంగతంతా వివరించి! జాలిగుండెగల సీతమ్మగారు బాబు పరిస్థితి చూచి ఓదార్చింది. సరిగ్గా అయిదుగంటలకల్లా వచ్చే నాన్న


శ్రీమదాంధ్ర
మహాభారతము
ఉద్యోగపర్వము
వెల రూ. 1-0-0
ఆంధ్రగ్రంథమాల,
మదరాసు-1



ఇప్పుడు మీరుమీ చర్మమును పరిమళముతో
సుందువిధమున ఆరోగ్యముగానుంచు
కొనవచ్చును —
అదిసౌందర్యమునిచ్చు
బ్రీజ్






ఎక్టుమర్ నగలిగియున్న
టాయ్‌లెట్ సబ్బు
- చర్మముమీది క్రిములను నిర్మూలించును
- ఒడలికంపును తొలగించును
మీ చర్మమును ఆరోగ్యముగానుంచును
మిమ్ములను హాయిగానుంచును




8 అణాలుమాత్రమే
స్థానిక పన్నులు అదనము

ప్రతి శనివారమున్ను రాత్రి 8½ గంటలకు రేడియో సిలోన్ హిందీ సర్వీసునందు — ఇరాస్మిక్ వారి 'హజార్ రుపయె' ప్రోగ్రామ్‌ను వినుడు.

ఇరాస్మిక్ కంపెనీ, లిమిటెడ్: లండన్‌వారి తరపున భారతదేశంలో తయారుచేయబడినది BZ. 8-50 TL

## కొత్తగొడుగు

గారు ఆ వేళ పదిగంటలకుగాని యింటికిరాలేదు. యింట్లోకి వస్తూనే గొడుగు...అదే బుట్టమార్కు క్రొత్తగొడుగు తీసికొని 'సీతా' అని పిలిచేడు. భర్తచేతిలోని గొడుగు చూసి నివ్వెరపోయింది సీత. సంగతి ఏమిటని అడగకవుంటుందా? అడిగింది. 'తాను సినిమాకు పోయావని సినిమాహాలు వెలుపల ఒకని రిక్షాలో ఆ గొడుగుందనీ, సంగతిని గ్రహించిన తాను అదే రిక్షాను పోలీస్టేషన్‌కు బాడుగకు కట్టించావని స్టేషన్లో రెండు తన్నించగా గొడుగు యిచ్చివేశాడని' నిమిషంలో తేల్చేశాడు రావుగారు. మహాసాధ్వి సీతమ్మగారు సంగతంతా విని నివ్వెరపోయింది.

చిక్కు చిక్కు మంటూ ఉదయాన్నే లేచిన బాబు వరండాలో చిలక్కొయ్యకు తగిలించిన బుట్టమార్కు క్రొత్తగొడుగు చూచి సంభ్రమాశ్చర్యములతో వంటగదిలోని సీతమ్మగారి దగ్గరికిపోయాడు.

ఆనాటినుండి బాబు గొడుగు... అదే క్రొత్తగొడుగు పేరెత్తలేదు ★


నాణ్యమైన సిల్కు పంచెలు
మరియు అంగవస్త్రములు!

**అసలైన సిల్కు, మెత్తని నేత**

— అవి బిన్నీవారిచే
తయారుచేయబడినవి



వీనిలో పిండి లేక జిగురు లేదు
— ఉతికితే పల్చగా అవవు

ఈ అసలైన సిల్కు పంచెల మరియు అంగవస్త్రముల నాణ్యము మరియు మెత్తని నేతలను పట్టుకుని చూడండి! అవి బిన్నీవారిచే తయారుచేయబడినవి మరియు ఈ కంపెనీ పేరు నుండి మీరు ఆశించే మేలు రకమువి దొరకుతాయి.

వీనిని వివాహములలో కానుకలుగా యివ్వండి — లేక మీరు కట్టుకొనుటకే కొనుక్కోండి. వాటి ధరలలో అంతకన్న మంచివి మీరు కొనలేరు. మీ బిన్నీ డీలరు దగ్గర వానిని నేడే చూడండి.

బంగారు రంగులో వేయబడిన అద్భుతమైన అంచులను గమనించండి. అవి వెడల్పు తక్కువగా క్రొత్త డిజైనులో ఉన్నాయి



బెంగుళూరు వులెన్, కాటన్ & సిల్కు మిల్సు కంపెనీ లిమిటెడ్
ఏజెంట్సు, సెక్రటరీస్ అండ్ ట్రెజరర్సు:
బిన్నీ అండ్ కంపెనీ (మద్రాసు) లిమిటెడ్

# గుఱ్ఱం కోరిన న్యాయం

పూర్వం ఇటలీలో ఒక పట్టణాన్ని జార్జి అనే రాజు పరిపాలిస్తూండేవాడు. అతడు చాలా మంచిరాజు. తన రాజ్యంలో ప్రజలందరికీ ఎప్పుడూ న్యాయం జరగాలని, వారంతా చాలా మంచి ప్రవర్తన గలవారుగా ఉండాలని, కోరేవాడు. తన జీవితాన్ని ఆలక్ష్య సాధనకే అంకితం చేశాడు. కాని అతను ఎంతగా ప్రయత్నించినా అన్యాయము, క్రౌర్యము, దుష్ప్రవర్తన ఆ రాజ్యంలో నానాటికి పెరుగుతున్నాయే కాని తగ్గటం లేదు. దాంతో ఆ రాజు చాలావిచారించవలసివచ్చింది.

ఒక రోజున తన రాజ్యంలోని న్యాయాధికారులందరినీ పిలిచి తన రాజ్యంలో రోజురోజుకీ పెరిగిపోతున్న అత్యాచారాన్నిగురించి చర్చించాడు. ఈ అత్యాచారాలను అరికట్టి ప్రజలకు శాశ్వతంగా న్యాయం జరిగేటందుకు ఉపాయమేదైనా చెప్పమని వారినికోరాడు. వెంటనే ఆ న్యాయాధికారులు లెక్కలేనన్ని సలహాలు ఇచ్చారు. వాటిలో ఆచరణయోగ్యమైనది, లాభదాయకమైనది అయిన సలహా ఒక్కటీ లేదు. అందుచేత అవి రాజుకి తృప్తికరంగా లేవు.

ఆఖరుకు ఒక ముసలి అధికారి నిలబడి "రాజా! నడివీథిలో నున్న పెద్దస్తంభానికి ఒకగంట వేలాడగట్టి, దానికొక తాడుకట్టి, రెండవ కొన క్రిందికి వ్రేలాడవేస్తే తప్పకుండా మనం ప్రజలకు తేలికగా న్యాయం చెయ్యగలుగుతాము. ఎవరికేనా అన్యాయం జరిగినట్టయితే ఆ గంట వాయిస్తారు. వెంటనే న్యాయాధికారి వెళ్ళి న్యాయం చెప్పవచ్చు. ఇది చాలా తేలికగాను, తక్కువ ఖర్చుతోను శాశ్వతమైన న్యాయం చెప్పటానికి వీలయే పద్ధతి అని నాకు తోస్తోంది..." అన్నాడు. ఆ రాజుకి ఇది చాలా నచ్చింది. వెంటనే నడివీథిలోని పెద్దస్తంభానికి గంట అమర్చబడింది.

*~~~~~~~~~~~~~~~~~~*

‘భా మ’

*~~~~~~~~~~~~~~~~~~*

రాజభటులు రాజ్యంలో నలుమూలలా తిరిగి అక్కడ కట్టిన గంటనుగురించి, దాని ఉపయోగాలనుగురించి ప్రజలందరికీ చెప్పారు. అప్పటినుండి తప్పుచెయ్యడానికి భయపడేవారు అక్కడి ప్రజలు. దోషులసంఖ్య, దుర్మార్గుల సంఖ్య ఆ రోజుకి ఆరోజు తగ్గిపోవడం ప్రారంభమయింది. వీరందరికి ఆ గంట అంటే భయం ఎక్కువయిపోయింది.

కొంత కాలానికి ఆ గంటకి కట్టిన తాడు తెగిపోయింది. అది గమనించిన ప్రజలు ఇక రాజుగారు ఖజానాలో సొమ్ము ఖర్చుపెట్టి దాన్ని బాగు చేయించాలని ఎదురుచూడక దానిమీదకి క్రిందనించి ఒక ద్రాక్ష తీగ ప్రాకించారు. అప్పటినుంచి న్యాయాన్ని అపేక్షించినవారు ఆ ద్రాక్ష తీగలాగితే గంట మ్రోగేది. అతి త్వరలో న్యాయం లభించేది.

ఆ పట్టణంలో జాన్ అనే భాగ్యవంతుడొకడుండేవాడు. అతను ఎంత భాగ్యవంతుడో అంత లోభి, అతనికంటె లోభి, పీనాసివాడు పుట్టలేదంటే ఆశ్చర్యం లేదు. ప్రజలందరికీ అతనంటే అసహ్యమే. అయితే అతను భాగ్యవంతుడు కావటంచేత ఎవరూ ఆమాట అతని ముఖంమీద అనటానికి సాహసించేవారు కాదు. తన డబ్బుతో కొందరు అధికారులని కూడా వశపరుచుకున్నాడు.

అతని వద్ద ఒక గుఱ్ఱం ఉంది. అది చాలా సంవత్సరాలు అతనికి సేవ చేసింది. అలాగ పని చేసి చేసి వార్ధక్యం వచ్చినందువల్ల ఇక ఏ పనీ చెయ్యలేకపోయేది. తనకు ఇకమీదట ఏవిధంగానూ ఉపయోగపడదనీ ఆ గుఱ్ఱాన్ని తను మేపటం అనవసరమనీ అనిపించింది అతనికి. అందుచేత దాన్ని వీథులవెంట వదిలేశాడు.

పాపం ఆ గుఱ్ఱం ఆకలితో బాధపడుతూ, ఆయాసంతో అడుగు

# ★ గుర్రం కోరిన న్యాయం ★

చెయ్యలేక రోడ్డుమీద నడుస్తోంది. ఎన్ని వీథులు తిరిగినా ఏమీ ప్రయోజనం లేకపోయింది. ఊర కుక్కలు దాన్ని చూసి మొరిగినా, దాన్ని కరిచినా కూడా ఏమీ చెయ్యలేకపోయేది. అలాగ తిరిగి తిరిగి చిట్టచివరకు రాజబాటవద్దకు వచ్చింది.

అక్కడ ఉన్న గంటకు వ్రేలాడే ద్రాక్షతీగెను చూసింది. వెంటనే దాన్ని ఉన్న పచ్చటి ఆకులన్నీ ఊడబెరుక్కుని తినటం ప్రారంభించింది. ఇది ఇలాగ లాగటంవల్ల గంట మ్రోగింది. ఎవరికి ఏ అన్యాయం జరిగిందో చూడాలని ప్రజలు, అన్యాయం జరిగినవారికి న్యాయం జరిపించాలని న్యాయాధికారి అక్కడికి వచ్చారు. ఆ గంట మ్రోగించినది ఆ గుర్రమేనని వెంటనే తెలుసుకోగలిగారు. "ఇది లోభి జాన్ గుర్రం. దానికి ఓపిక ఉన్నంత కాలం దానిచేత పనులన్నీ చేయించుకుని ఇప్పుడు వార్ధక్యం రావటంతోటే ఇంట్లోంచి వెళ్లగొట్టాడు తిండి పెట్టకుండా. అందువల్ల ఇది ఈ పచ్చటి ఆకులు తినేందుకు వచ్చింది. రండి!...మనం ఇళ్ళకి పోదాం..!.." అన్నాడు ఒకడు.

కాని న్యాయాధికారి దానికి ఒప్పుకోలేదు. "ఆ గుర్రం గంట మ్రోగించింది. అంటే అది న్యాయాన్ని అపేక్షించిందన్న మాట. కనక దానికి న్యాయం చెయ్యవలసిందే......వెంటనే దీని యజమాని జాన్‌ని పిలుచుకురండి" అన్నాడు.

తనంతటి ధనవంతుణ్ణి అలాగ పదిమందిలోకి తీసుకువచ్చి విచారించబోతున్నారంటే బాధ, కోపం కూడా వచ్చాయి జాన్‌కి. "ఇదేమిటండీ!......ఏదో తెలివితక్కువగా గుర్రం గంటకి ఉన్న కొమ్మ లాగితే నన్ను ఇక్కడికి పిలిపించివేశారే!.." అన్నాడు అధికారితో వేళాకోళంగా నవ్వుతూ.

"అయ్యా! ఇది వేళాకోళం చెయ్యదగ్గవిషయం కాదు. ఆగుర్రం మీది. ఎన్నో సంవత్సరాలుగా అది మీకు సేవచేస్తోంది. ఇప్పుడు బాగా ముసలిది కావటంవల్ల ఇక పనిచెయ్యలేని మాట నిజమే. కాని అంతమాత్రంచేత మీరు ఇంక దానికి ఏమాత్రం తిండిపెట్టకుండా ఇంట్లోంచి వెళ్లగొట్టడం చాలా అన్యాయం, క్రూరం కూడాను. చూడండి!...అది ఆకలితో ఎలాగ వాడిపోతోందో!..." అన్నాడు అధికారి.

దాంతో జాన్‌కి మరింత కోపం వచ్చింది. ఇంతవరకు తన మాటకి ఎదురు చెప్పినవారు, తను చేసినది కాదన్నవారు లేరు. అలాంటిది ఇవాళ తను చేసిన పనిని కాదని పదిమందిలో నడివీథిలో ఆక్షేపిస్తే సహించలేకపోయాడు. "వినండి!... అది నా గుర్రం......అందుచేత నా ఇష్టం వచ్చినట్టు చేసుకుంటాను... నేను దానిమీద స్వారీ చేసినా, ఏమీ చెయ్యకుండా వీథులోకి గెంటివేసినా సరే అడిగేందుకు ఎవరికీ హక్కు లేదు......ఇవాళ ఇక్కడ ఇన్ని కబుర్లు చెపుతున్నవారిలో ఒకరేనా దానికి ఒక్క గడ్డిపరకయినా వేసిన పాపాన పోయారా!.. మరి ఊరికే కబుర్లెందుకూ?...మీకంత జాలి ఎక్కువయినట్టయితే మీరు తీసుకువెళ్లి మేపరాదూ?.." అన్నాడు కోపంగా.

ఈ ధోరణి చూస్తే న్యాయాధికారికి అసహ్యమూ, కోపమూ కూడా వచ్చాయి. ఇక అలాంటి వాడితో సవ్యంగా మాట్లాడితే లాభంలేదని గ్రహించి "ఏయ్! జాన్......భగవంతుని ప్రతినిధిగా నేను నిన్ను ఆజ్ఞాపిస్తున్నాను... విను...నువ్వు ఈ గుర్రాన్ని ఇంటికి తీసుకువెళ్లి అది బ్రతికిఉన్నంతకాలం శుభ్రంగా మేపు. ఈ పని సరిగ్గా చెయ్యకపోయావా—నీకు శిక్ష తప్పదు..." అన్నాడు. ఇక చేసేదేమీలేక ఆ గుర్రాన్ని వెంటబెట్టుకుని ఇంటికి బయల్దేరాడు జాన్. ప్రజలంతా అతని చుట్టూ మూగి "లోభికి బలేశాస్తి అయింది" అంటూ చప్పట్లుకొట్టి అరిచారు.

(ఆంగ్లకథ ఆధారంగా) ★




నారసింహ లేహ్యము

బంగారుతో చేరినది. మేహము వికారం, విస్ఫుత్తువ వగైరా హరించి బలము రక్తవృద్ధి కల్గించును. 20తు. డబ్బీ రు. 3-4-0 పోస్టేజి అ 1-1-0

పి. వి. ఏ. అండ్ కో, (ఆయుర్వేద సమాజం)

పెరిదేపి (పోస్టు) — నెల్లూరుజిల్లా.



మంచీ - చెడూ

వెల 2-0-0

పోస్టుఖర్చు ప్రత్యేకం



ప్రఖ్యాతమైన సంజీవగూడు పండ్లపొడి వారి

ఆవశ్యమైన కుటుంబ ఔషధములు

కాస్మస్ కస్తూరి మాత్రలు...రూ. 0-0-0

కర్‌జక్ గోరోచన మాత్రలు... 0-0-0

బాలక్స్ విరేచనముగుటకు మాత్రలు.. 0-0-0

మా మందుల పూర్తి జాబితాకు వ్రాయుడు

యునైటెడ్ కన్సర్న్, బందరు వీధి, మద్రాసు-1. విజయవాడ.

బౌద్ధగాథ:

# కోడిపిల్ల, ఆడపిల్ల

ఒకసారి ఒకవాడు శ్రావస్తీనగరం ప్రయాణమై వెళ్తూ ఉండగా, దారిలో అచిరావతి నది ఒడ్డున అతనికి, పావురపుగుడ్లు కొన్ని దొరికాయి. అవి తీసుకుని, అతడు శ్రావస్తిలో ఒక స్నేహితుడి ఇంటికి వెళ్ళి వాటిని వండించుకుని తిన్నాడు. వాటిలో ఒక గుడ్డుమాత్రం తనస్నేహితుడి కుమార్తెకి ఇచ్చాడు. ఆ మర్నాటినించి ఆ పిల్ల గుడ్లు తప్ప ఇంకేం తిననని పంతం వేసుకు కూర్చో సాగింది. సరేగదా అని వాళ్ల అమ్మ రోజూ గుడ్లు పెట్ట సాగింది.

అయితే, గుడ్లరుచి మరిగిన ఆ అమ్మాయికి ఆశ ఎక్కువైపోయింది. అందుకని, రోజూ తనే, కోడిగుడ్లు తెచ్చుకుని వండుకు తినడం సాగించింది.

ఆ యింటవున్న కోడికి ఇదిమాసి కడుపు మండింది. రోజూ తన గుడ్లను పొట్టకెట్టుకుంటున్న ఆ పిల్లమీద పగబట్టింది. 'వచ్చే జన్మలో నేను దెయ్యమై దీని పిల్లల్ని పొట్ట పెట్టుకునేటట్టు వరమియ్యి దేవుడా' అని రోజూ ప్రార్థించేది.

కొన్నాళ్లకి ఆ కోడి చచ్చిపోయి, పిల్లి జన్మం ఎత్తింది. అన్నాళ్ళూ ఆ కోడిగుడ్లు తిన్న అమ్మాయి కూడా చనిపోయి, కోడి అయి పుట్టింది. ఆ కోడి పెట్టిన గుడ్లన్నీ, దాని మీద పగబట్టిన పిల్లి పొట్టని పెట్టుకునేది. ఇలా కొన్నాళ్లు జరిగేసరికి, ఆ కోడి, కడుపు చిచ్చుకొద్దీ పిల్లిమీద కసికట్టింది. వచ్చే జన్మలో "ఈ పిల్లినీ, దీని పిల్లల్నీ మింగెయ్యాలని" ఒట్టేసుకుంది. ప్రార్థించింది.

ఆ తరవాత జన్మలో, కోడి (మొదట్లో గుడ్లు తింటూ వచ్చిన అమ్మాయి) చిరుతపులిగా పుట్టింది. పిల్లి లేడి అయిపుట్టింది.

ఆ లేడి, ఒక పిల్లను కనగానే, పగబట్టిన చిరుతపులి ఆ రెంటినీ మింగివేసింది.

ఇలా ఒక జన్మలో ఒకటి పగతీర్చుకుంటూ ఉంటే, రెండోది పగబట్టేది. ఈ విధంగా ఆ అమ్మాయి, ఆ కోడి, ఐదువందల జన్మలు ఎత్తినా ఆ పగ అణగనేలేదు.

చిట్టచివరి జన్మలో ఆ అమ్మాయి శ్రావస్తిలో ఒక పిశాచం అయి పుట్టింది. ఆ కోడి, ఒక ఆడపిల్లగా పుట్టింది.

అప్పుడు, బుద్ధుడు శ్రావస్తిలోని 'జేతవనం'లో ఉంటూ ధర్మబోధ చేస్తున్నాడు. ఒక రోజున ఈ ఇద్దరూ ఆయన కంటబడ్డారు. వీరి సంగతి ఆయనకు వెంటనే అర్థం అయిపోయింది.

ఆయనకి దయకలిగింది. ఐదువందల జన్మలుగా సాగుతూవచ్చిన ఈ పగనుంచి, వారికి విముక్తి కలిగించాలనుకున్నాడు.

అప్పుడు ఆ పిశాచానికీ, ఆ అమ్మాయికీ ధర్మాన్ని బోధించాడు.

"అదుగో వాడు నన్ను నొప్పించాడు. నన్ను కొట్టాడు; నా సొత్తు దోచుకున్నాడు నన్ను ఓడించాడు అంటూ ఏ ఒకరూ ఎదటివాళ్లమీద పగపట్టకూడదు. అలా పగపట్టితే అది జన్మజన్మాలకి పట్టుకుని పీడిస్తుంది.

"పగ లేకపోతే విరోధం ఉండదు. విరోధం లేకపోతే పగే పుట్టదు. అవి పోతేనే విముక్తి కలుగుతుంది".

బుద్ధుడు చెప్పిన ఈ ధర్మాన్ని వినగానే, పిశాచం 'శరణత్రయాన్ని' పఠించింది. ఐదు శీలాలనీ పాలించింది. అక్కడితో దానికి ఆ పగ, దాంతోపాటు ఆ పిశాచరూపం వదలిపోయాయి.

ఆ అమ్మాయి స్రోతాపన్నురాలు అయి, బుద్ధుని ధర్మాన్ని అనుసరించి ముక్తి పొందింది. ★

# అరుణావలయం

(8-వ పేజీ తరువాయి)

"అదేం పనికిరాదు నాదగ్గిర. నేనూ అతడూ పెళ్ళి చేసుకుందామనుకుంటున్నాం."

"ధాధా. నా ఉద్దేశం అది కాదు. ప్రేమికుల మధ్య అడ్డుపుల్లలు వెయ్యాలనే కోరిక నాకెన్నడూ లేదు," అని అమాయకత్వం నటిస్తూ థాలియా అన్నది.

"నువ్వేమీ వ్యంగ్యంగా మాట్లాడనక్కరలేదు. ఈ వ్యవహారంలో ప్రేమ గీమ పనికిరావు."

థాలియా కవర్లుచించే కత్తితో ఆడుకుంటూ "ఒకవేళ నేను మీ ముఠాలోకి రావడానికి ఒప్పుకోకపోతే?" అని అడిగింది.

మిలీ మార్ రాయ్ అనుమానంగా చూసింది.

"బ్యాంకి మూసేసిన తరవాత మాతో కలిసి భోజనం చేద్దువుగాని రా" అని మిలీ ఆహ్వానించింది.

ఎస్ట్రెలా
బేటరీస్
ESTRELA
BRIGHT LIGHT LONG LIFE
ESTRELA BATTERIES LTD. BOMBAY
చీకటిలో మీకు మార్గదర్శి
ఎస్ట్రెలా బేటరీస్ లిమిటెడ్,
బొంబాయి-మద్రాస్-ఢిల్లీ-నాగపూర్-కలకత్తా-కాన్పూర్
NAS-56

# అరుణ వలయం

"విందుల మీద విందులు తగులుతున్నాయే నాకివాళ!" థాలియా ఈ మాట అనగానే మిలీ గ్రహించింది.

"అరె. ఆ ముసలాడు నిన్ను విందుకు పిలిచాడా? ఎంత అదృష్టం! వాడిదగ్గర బోలెడు డబ్బు మూలుగుతోంది. వడ్డీ వ్యాపారంలో చాలా సంపాదించాడు. అయితే ఒకటి రెండు వారాలలో నీ మెడలో వజ్రాలహారం మెరుస్తూ ఉంటుందన్న మాట."

"నాకు వజ్రా లిష్టంలేదు. ముత్యాలు కావాలి. సరే, మాక్ రాయ్! ఇవ్వాళ రాత్రి నిన్ను కలుసుకుంటాను."

మిలీ మాక్ రాయ్ కాస్త తటపటాయించింది.

"ఇదిగో ఒక మాట మిస్ డ్రమండ్! నేను అతనూ పెళ్ళి చేసుకుంటామన్నానే, అది అతనివద్ద ఎత్తవద్దు సుమా!"

థాలియా లేచి నుంచుంది. "బ్రబజాన్ గదిలో బెల్ మోగుతోంది. వెళ్ళాలి. ఊహూ. ఆ విషయం ఎత్తను. అయినా నాకు కట్టుకథలంటే ఆసక్తి లేదు," అని నోటుబుక్కు తీసుకుంది.

థాలియా గది బయటికి వచ్చింది. యజమాని గదికేసి నడిచింది. మిలీ ఆమెవంక ద్వేషంతో కూడిన చూపులతో చూస్తూ నిలబడింది.

థాలియా యజమానివద్దకు వెళ్ళింది. అతడామెకు ఒక కవరిచ్చాడు. "ఈ కవరు ఎవరన్నా మనిషి చేతికిచ్చి పంపించు" అని ఆజ్ఞాపించాడు.

థాలియా కవరుమీద చిరునామా చూసింది. తరవాత బ్రబజాన్ వంక అదో మాదిరి ఆసక్తితో చూసింది. అరుణవలయం సభ్యులు ఎందరో, ఎన్ని రకాలవారో అని ఆమెకు ఆశ్చర్యం కలిగింది.

(ఇంకా ఉంది)

# న్యూఢిల్లీ లేఖ

(5వ పేజీ తరువాయి)

అదుపులో ఉంచడానికి కట్టుదిట్టాలు ఏమాత్రం ఉన్నాయి, అనవసరం ఖర్చు, అవసరమైన ఖర్చు పేరిట దుబారా ఎలాజరుగుతున్నాయి, మొత్తంమీద సంస్థ నడవటానికి అయ్యేఖర్చు ఎంత, అంత ఖర్చుకావచ్చునా - ఇత్యాది విషయాలను పరిశీలించి నివేదిక ఇచ్చే అవకాశం లేదు. ఇటువంటి నివేదిక ఉంటేతప్ప, ఆయా సంస్థలు బాగా సాగేదీ లేనిదీ, బాగు చేయడానికి మరింతగా జాగ్రత్తపడవలసినదీ లేనిదీ పార్లమెంటు ఆలోచించి తేల్చడానికి అవకాశం లేదు. కొన్ని కొన్ని భీమాసంస్థల వ్యవహారాలను గురించి ఆర్థికమంత్రి ఈ మధ్య పార్లమెంటులో బయట పెట్టిన సంగతులు గమనిస్తే, ఆడిట్ తనిఖీలవల్ల బయటకువచ్చే సమాచారం ఎంత అసమగ్రంగా ఉన్నదీ విశదం అవుతుంది. పూర్తిగా వాటిమీద ఆధారపడడం ఎంత అవాంఛనీయమో తెలుస్తుంది...

ప్రభుత్వం డబ్బుఖర్చుపెట్టే తీరుతెన్నులను వెయ్యికళ్ళతో కనిపెట్టి చూడడమే ఆడిటర్ జనరల్ పని. పార్లమెంటు ఏపనికి ఎంతడబ్బు ఖర్చుకావాలని నిశ్చయిస్తుందో, ఆమేరకు అంతా సవ్యంగా సాగేటట్లు చూడడం ఆ ఉద్యోగి విధ్యుక్తధర్మం. అంతేతప్ప, భారతదేశ ప్రభుత్వం ఏ పద్ధతిలో రూపొందాలో, రిటైరైన ఉద్యోగులకి పెన్షన్లు ఎంత ఇవ్వాలో సలహాలివ్వడం ఆయన ఉద్యోగధర్మం కాదు. దేశభక్తి మరీ ముమ్మరంగా ఉంటే, తనజీతం ఎంత తగ్గించవచ్చునో ప్రభుత్వానికి నిక్షేపంలా సలహాఇచ్చి తెలియచెప్పవచ్చును. ఆయన ఇంకొకటికూడా చెప్పవచ్చును. అసలు, చెప్పాలికూడా. విదేశాలలోని భారత రాయబారి కార్యాలయాల జమాకర్చులు తనిఖీ చెయ్యడానికై వేసంకాలంలో ఆయన విదేశయాత్రలు ఎందుకుచేస్తున్నట్టు? ఢిల్లీలోని బ్రిటిష్ రాయబారి కార్యాలయం పద్దులుచూడడానికి బ్రిటన్ ఆడిటర్ జనరల్ ఇక్కడికి తరలివస్తున్నాడా? పోతే ఇంకో సంగతికూడా ఉంది. ఈయన వేసంకాలంలో మాత్రమే యూరప్ అమెరికాలలోని రాయబార కార్యాలయాల తనిఖీకి ఎందుకు వెళ్తున్నట్టు, ఆతనికి ఏ ఆఫ్రికా, ఆసియా దేశాలలోని కార్యాలయాలలో ఎందుకు చెయ్యరాదు? మరొక్క ముక్క. పార్లమెంటులో ప్రధాని మాట్లాడినపుడు (ఆయన ప్రసంగాలకు డబ్బు ఖర్చుతో ప్రమేయం లేకపోయినా) ఆడిటర్ జనరల్ హాజరై మార్గోపదేశం ఉద్యోగధర్మాలలో ఒకటా?

ఇప్పుడున్న ఆడిటర్ జనరల్ కు సంబంధించినంతవరకూ ఒకసంగతి చెప్పుకోవాలి. ఇంతవరకు, ఆయన ఏ ఉద్యోగంలోనూ కూడా ఏణ్ణర్థం, రెండేళ్ళకి మించి ఉండలేదు. మొత్తానికి ఈయన తరువాయి ఉద్యోగం ఏమిటే అన్నది, దేశాభిమానులు కాస్త ఆందోళనతో మధనపడి ఎదురుచూడాల్సిన సంగతే. ★

# బొంబాయి సినిమా లేఖ

(36-వ పేజీ తరువాయి)

వర్ణచిత్రంగా నిర్మించ సంకల్పించారు. భారత చిత్రాలలో అగ్రశ్రేణికి చెందే ఈ చిత్రంలో ఆజాదు గ్యాని, సుర్జిత [illegible]యర్, ముఖ్యభూమికలు నిర్వహించారు. మెహతాజ్, చంద్రశేఖర్లు కూడా అందులో ప్రముఖపాత్రలు పోషించారు. ఈనాటి అగ్రనటుడు భరత్ భూషణ్, దర్శకుడు ఎస్. కె. ఓఝూ, కెమెరామన్ ఎం. ఎల్. మల్హోత్రా అందులో చిన్న చిన్న వేషాలు వేశారు. ఆ చిత్రానికి సంగీతం యావత్తూ కూడా (పాటలూ నేపథ్య సంగీతం సహా) ఒక్క భైరవిరాగంలోనే సమకూర్చబడింది. అందులో, కీ॥ శే॥ ఉస్తాద్ జండేఖాన్ పాడినపాటలు, విన్నవారికి ఈనాటికీ మరపుకు రావు.

* * *

'సంగీత్ చిత్ర' సంస్థ నిర్మించనున్న ఒక చిత్రంలో దిలీప్‌కుమార్, బీనారాయ్ తొలిసారిగా కలసి నటిస్తారు. దానికి ఎ.ఆర్. కర్దార్ దర్శకుడు నౌషద్ సంగీతం కూర్చుతారు.

'బందీష్' చిత్రం నిర్మించిన 'బసు చిత్ర సుందర్' వారు ఇపుడు రెండు చిత్రాలకు సన్నాహాలు చేస్తున్నారు. ముందు 'ఏక్ గాఁవ్ కీ కహానీ' అనే చిత్రం ప్రారంభించి, ఆ తరవాత, 'సవేరా' అనే చిత్రం తీస్తారట. సత్యేన్‌బోస్ వద్ద సహాయకుడుగా పనిచేసిన ఒక యువకుడు తొలిసారిగా, వీటిలో మొదటి చిత్రానికి దర్శకత్వం వహిస్తాడు. పల్లెటూరికి వచ్చిన ఒక బస్తీ డాక్టరు కథను ఇందులో చిత్రిస్తారు. అభి భట్టాచార్య, నిరూపరాయ్, ఐ. ఎస్. జోహార్, మాలాసిన్హా, లలితాపావర్, బిపిన్ గుప్త, భాను బెనర్జీ నటిస్తారు. సలీల్ చౌదరి సంగీతం సమకూర్చుతారు.

* * *

రూప్ కమల్ చిత్రవారి 'జేవణా' మోహన్ స్టూడియోలో చురుకుగా తయారవుతోంది. వకీలా, కిశోర్, ముబారక్, కృష్ణకాంత్, రాధాకిషన్ నటిస్తున్న ఈ చిత్రానికి నరేంద్రసూరి దర్శకుడు. సంగీతం శంకర్ జైకిషన్.

బి. ఆర్. చోప్రా కొత్త చిత్రం 'నయా దౌర్'లో దిలీప్, మధుబాల ముఖ్య ప్రాత్రలు నిర్వహిస్తారు. డెయిసీ ఇరానీ కూడా ఇందులో ఉంటుంది. ఇందులో జానపద నృత్యాలు పుష్కలంగా ప్రవేశపెడతారని తెలుస్తోంది.



Printed and Published for Nageswara Rao Estates (Private) Ltd., by S. Radha Krishna at The Andhra Patrika Press, 6 & 7, Thambu Chetty Street, Madras-1. Editor S. Sambhu Prasad.



కంచి, కైలాసనాథాలయంలో మహాలక్ష్మీ ప్రతిమ

ఫొటో : వి. కేశవశర్మ.




L. 259-X52 TL
భారతదేశంలో తయారు చేయబడినది